# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★



ఇవి గాక ఫోటోశీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో
ఆకర్షణలు.



కేరళ కుగ్రామంలో జరిగిన, యదార్థ ప్రణయగాధ !!!



# చిన్న చిన్న ఉప్పు బిస్కట్లు





## చక్రా-70 బ్రిటానియా బిస్కట్లు మాత్రమే ఇవ్వగల ప్రత్యేకమైన రుచి

సైజులో చిన్నవి. తినడానికి అనుకూలమైనవి.
మీరు వెచ్చించే డబ్బుకి ధారాళంగా కొనుక్కోవచ్చు.
గరగరలాడుతూ వుండే చక్రా-70 రుచికరమైనవి.
ఎన్ని తిన్నా తనివి తీరదు.




అంటే నాణ్యత

BBC/6167

**Statement about ownership of CHANDAMAMA (Telugu)**
**Rule 8 (Form IV), Newspapers (Central) Rules, 1956**

| | | | |
|---|---|---|---|
| 1. | *Place of Publication* | : | 'CHANDAMAMA BUILDINGS'<br>2 & 3, Arcot Road,<br>Vadapalani, Madras-26 |
| 2. | *Periodicity of Publication* | : | MONTHLY<br>1st of each calendar month |
| 3. | *Printer's Name* | | B. V. REDDI |
| | *Nationality* | : | INDIAN |
| | *Address* | : | Prasad Process (Pvt) Ltd.,<br>2 & 3, Arcot Road, Vadapalani,<br>Madras-26 |
| 4. | *Publisher's Name* | : | B. VISWANATHA REDDI |
| | *Nationality* | : | INDIAN |
| | *Address* | : | Managing Partner,<br>Sarada Binding Works,<br>2 & 3, Arcot Road, Vadapalani,<br>Madras-26 |
| 5. | *Editor's Name* | : | CHAKRAPANI (A. V. Subba Rao) |
| | *Nationality* | : | INDIAN |
| | *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani,<br>Madras-26 |
| 6. | *Name & Address of individuals who own the paper* | : | SARADA BINDING WORKS:<br>PARTNERS<br>1. Sri B. Viswanatha Reddi,<br>2. Sri B. L. N. Prasad,<br>3. Sri B. Venugopal Reddi,<br>4. Sri B. Venkatrama Reddy,<br>5. Smt. B. Seshamma,<br>6. Smt. B. Rajani Saraswathi,<br>7. Smt. A. Jayalakshmi,<br>8. Smt. K. Sarada. |

I, B. Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**B. VISWANATHA REDDI**
*Signature of the Publisher*

*1st March* 1971



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ ["లక్ష్మీ సరస్వతులు"]కు ఆధారం టి. ఎస్. మోహన్ రచించిన కథ. లక్ష్మీ సరస్వతులకు పొత్తు కుదరదని ఈ కథ నిరూపిస్తుంది. మూఢవిశ్వాసాలను ప్రజలలో నుంచి తొలగించటం ఎంత కష్టమో "పక్షిమాన్యం" అన్న కథ స్పష్టం చేస్తుంది. ప్రజలకు పాలకులు మేలు చేయదలిచినా కూడా ప్రజల మూఢవిశ్వాసాలే అడ్డురావచ్చు.

సంపుటి 48 మార్చి '71 సంచిక 3







# అమరవాణి

ఉత్సాహః, సాహసం, ధైర్యం, బుద్ధిః, శక్తిః, పరాక్రమః
షడేతే యత్ర తిష్ఠంతి తత్ర దేవోపి తిష్ఠతి. 1

[ఉత్సాహమూ, సాహసమూ, ధైర్యమూ, బుద్ధీ, శక్తీ, పరాక్రమమూ ఎక్కడైతే ఉంటాయో అక్కడ దేవుడే ఉంటాడు.]

రత్నైః మహాబ్ధేస్తుతుషుర్న దేవా, న భేజిరే భీమవిషేణ భీతిమ్,
సుధాం వినా న ప్రయయుర్విరామం; న నిశ్చితార్థాత్ విరమంతి ధీరాః. 2

[దేవతలు పాలసముద్రంలోని రత్నాలతో తృప్తిపడక, కాలకూటానికి బెదరక, అమృతం వచ్చిన దాకా కృషి చేశారు. ధీరులు తమ కోరిక తీరేదాకా పూనిక విడవరు.]

ప్రారభ్యతే న ఖలు విఘ్నభయేన నీచైః;
ప్రారభ్య విఘ్ననిహతా విరమంతి మధ్యాః;
విఘ్నైః ముహుర్ముహు రపి ప్రతిహన్యమానాః
ప్రారబ్ధ ముత్తమగుణాః న పరిత్యజంతి. 3

[అధములు విఘ్నాలకు భయపడి ప్రయత్నమే చెయ్యరు. మధ్యములు ప్రారంభించిన పనికి విఘ్నాలు రాగానే విరమిస్తారు. ఉత్తములు ఎన్ని విఘ్నాలు మళ్ళీ మళ్ళీ ఎదురైనా తమ ప్రయత్నాన్ని మానరు.]

ధీరులు



# పక్షిమాన్యం

మణిపురరాజ్యంలో ఒక విశాలప్రాంతం బీడుగా ఉండేది. దాన్ని రక్కసిబీడు అనే వాళ్ళు. ఆ బీడు మధ్య ఒక బిలం ఉన్నది. ఆ బిలంలో ఒక రక్కసి ఉన్నదనీ, ఆ బీడులో ప్రవేశించిన వారిని అది చంపేస్తుందనీ జనం చెప్పుకునే వారు.

తండ్రిపోయి, కొత్తగా రాజ్యాభిషేకం చేసుకున్న సుదర్శనుడు ప్రజల భ్రమలను పోగొట్టాలనీ, రక్కసిబీడును శ్రేష్ఠమైన వ్యవసాయ క్షేత్రంగా మార్చాలనీ అనుకున్నాడు. సుదర్శనుడికి సుమంతు డనే స్నేహితు డొకడున్నాడు; అతను మంచి తెలివి తేటలుగలవాడు. అందుచేత సుదర్శనుడు తన ఆలోచనను సుమంతుడికి చెప్పాడు.

"మీ తాతముత్తాతల కాలం నుంచీ జనంలో ఉంటూ వస్తున్న మూఢనమ్మకాన్ని పోగొట్టటం అంత తేలికకాదు. అక్కడి బిలంలో రక్కసి లేదని మనం చెప్పిన మాత్రాన ఎవరూ నమ్మరు. అందుచేత మనం ప్రజలకు ఏదో ఆశచూపాలి. అలా చేసేముందు, అక్కడి పరిస్థితి మనం స్వయంగా చూసి వద్దాం," అన్నాడు సుమంతుడు సుదర్శనరాజుతో.

ఇద్దరూ బయలుదేరి, ఎవరికీ తెలియకుండా రక్కసిబీడుకు వెళ్ళారు. అది అనేకవేల ఎకరాల ప్రదేశం. దానిమధ్యలో ఒక బిలం ఉన్నది. ఇద్దరూ కొంత దూరం బిలంలోకి దిగారు. కాని పోనుపోను అది ఇరుకయింది. అందులో రక్కసి ఉండటం అసంభవం అని తేలింది. కాని ఆ మాట జనాన్ని నమ్మించాలి.

సుమంతుడు రెండు వజ్రాలు తీసి బిలంలోకి జారవిడిచాడు. తరవాత వాళ్ళు రాచనగరుకు తిరిగి వచ్చారు. తిరిగి వస్తూనే సుదర్శనుడు ఇలా ప్రకటన చేశాడు:

కె. కె. రావు




"రక్కసి బిలంలో ప్రవేశించి, దాని అడుగున ఏమున్నదో చెప్పినవారికి రాజుగారు ఘనమైన బహుమానం ఇస్తారు."

ఈ ప్రకటన విని ఎవరూ ముందుకు రాలేదు: పై పెచ్చు తమరాజు కుర్రతనం చేత అలాటి ప్రకటన చేశాడని అనుకున్నారు.

మణిపురరాజ్యంలోని ఒక గ్రామంలో రామయ్యా, భీమయ్యా అని ఇద్దరు అన్నదమ్ములుండే వారు. భీమయ్య సంసార భారాన్ని పూర్తిగా తన అన్నమీద వదిలి, అస్తమానమూ తన పెంపుడు పావురంతో పావురాల ఆట ఆడుతూ, గ్రామం పక్కన వున్న తోటల్లో తిరిగేవాడు.

ఒకసారి భీమయ్యను అన్న చివాట్లు వేసి, "ఇలా బతక్కపోతే ఆ రక్కసి బిలంలో దూకి చావరాదూ ?" అని తిట్టాడు. ఆ వెంటనే భీమయ్యకు రాజు చేసిన ప్రకటన వినిపించింది.

అన్న తిట్టిన తిట్లకు పౌరుషం వచ్చిన భీమయ్య రక్కసి బిలంలో దూకాలనీ, అదృష్టం కలిసివస్తే రాజుగారి బహుమానం పొంది స్వతంత్రంగా బతకాలనీ, లేదా రక్కసి చేతిలో చావాలనీ నిశ్చయించుకున్నాడు. అతను కొంత ఆహారం వెంట తీసుకుని, తన పెంపుడుపావురాన్ని భుజాన ఉంచుకుని, రక్కసిబీడుకు వెళ్ళాడు. రక్కసి వచ్చి చంపుతుందేమో నని భయంగా ఉన్నా, బిలంలోకి తొంగిచూశాడు. అందులో రక్కసి ఏదీ లేదు. కాని అందులోకి దిగాలంటే భయంగానే ఉన్నది.

ముందు తిండి తిని తరవాత ఏం చేసేదీ ఆలోచింతామని మూట విప్పి, ఒక చిన్న రొట్టెముక్క తుంపి బిలంలోకి వేసి చూశాడు. లోపలి నుంచి ఏదన్నా పైకి వస్తున్నట్టు కనిపిస్తే పారిపోవాలని అతని ఉద్దేశం. కాని అతను అనుకోకుండా అతని భుజం మీద ఉన్న పావురం తుర్రున బిలంలోకి దిగింది. అది క్షేమంగా తిరిగి వస్తే తాను కూడా బిలంలోకి దిగి రాజుగారి బహుమానం పొందుదామని భీమయ్య అనుకున్నాడు.

కొంతసేపటికి పావురం తిరిగి వచ్చింది. కాని దాని ముక్కున ఒక వజ్రం ఉన్నది. భీమయ్య పరమానందభరితుడైనాడు. తాను వజ్రం సంపాదించుకున్న తరవాత తన అన్న తనను ఏమీ అనలేడు. ఆ ఉత్సాహంతో భీమయ్య ఇంటికి వెళ్ళి, తన అన్నకు వజ్రం చూపించి, "చూశావా, రక్కసి బిలంలో నుంచి వజ్రం తెచ్చాను. దీన్ని అమ్ముకుని హాయిగా నా దారిన నేను బతుకుతాను," అన్నాడు.

ఆ వజ్రం చూడగానే రామయ్యకు దుర్బుద్ధి పుట్టింది. అతను తమ్ముడితో, "దీన్ని అమ్ముతావా? రాజుగారికి తెలిసి నిన్ను కొరత వేయిస్తారు. ప్రస్తుతానికి ఈ సంగతి ఎవరికీ చెప్పకు. కొంత కాలం పోయాక దీని విషయం ఏదో ఒకటి చేద్దాం," అన్నాడు.

భీమయ్య అందుకు ఒప్పుకున్నాడు. మర్నాడే రామయ్య ఆ వజ్రాన్ని తీసుకుని, రాచనగరుకు ప్రయాణమై వెళ్ళి, రాజుగారి దర్శనం చేసుకుని, "మహారాజా, నేను రక్కసిబిలంలో దిగి ఈ వజ్రాన్ని తెచ్చాను. నాకు తమరు మంచి బహుమానాన్ని ఇప్పించాలి," అన్నాడు.

సుదర్శనుడు సుమంతుణ్ణి పిలిపించాడు. ఇద్దరూ వజ్రాన్ని పరీక్షించారు. అది సుమంతుడు రక్కసిబిలంలో పడవేసిన వజ్రమే. అందుకు సందేహం లేదు.

"దీనితోబాటే ఇంకో వజ్రం కూడా ఉన్నది. దాన్ని నువు కాజేసినందుకు నిన్ను



కారాగృహంలో పెట్టించవలసి ఉన్నది." అన్నాడు సుమంతుడు.

రామయ్య హడలిపోయి, "బహుమానం లేకపోతే మానె, నన్ను చెరలో పెట్టకండి!" అని ప్రాధేయపడ్డాడు.

అతను బిలంలోకి దిగి ఆ వజ్రాన్ని తెచ్చినవాడే అయితే బహుమానాన్ని అంత సులువుగా వదులుకోడు.

"నిజం చెప్పు. నీకీ వజ్రం ఎక్కడ దొరికింది?" అని సుమంతుడు మళ్ళీ అడిగాడు.

తన తమ్ముడు అబద్ధం చెప్పి ఉండ వచ్చు! వాడు దీన్ని ఎక్కడైనా దొంగతనం చేసి ఉండవచ్చు! అందుచేత, పీడ వాడి మీదిగానే పోనిద్దా మని రామయ్య, "మహా ప్రభో, ఇది నా తమ్ముడు తెచ్చాడు. రక్కసి బిలంలో దొరికిందన్నాడు. నాకు అంతకన్న ఏమీ తెలీదు," అన్నాడు.

"అయితే నువు ఇంటికి వెళ్ళి మీ తమ్ముణ్ణి వెంటనే పంపించు," అన్నాడు సుదర్శనరాజు.

భీమయ్య వచ్చాడు. అతను జరిగినది జరిగినట్టుగానే చెప్పాడు. అతని మాటలు నమ్మదగినవిగా ఉన్నాయి. అతన్ని ఆ రాత్రికి రాజుగారి అతిథిగా ఉంచి, మర్నాడు నిండు సభలో పెద్ద సన్మానం చేశారు.

"ఇతను ధైర్యసాహసాలతో రక్కసిబిలానికి వెళ్ళి, అందులో నుంచి ఈ మణిని తెచ్చాడు. రక్కసిబిలంలో రక్కసి లేదని లోకానికి తెలుపటానికి మేమే ఈ మణిని ఆ బిలంలో వేశాం. ఇతని సాహసానికి మెచ్చి మేము ఇతనికి రక్కసిబీడును ఈనాముగా ఇచ్చేస్తున్నాం. వ్యవసాయం చేసుకోగోరేవారు అతనికి బాడుగ చెల్లించి పొలాలు పుచ్చుకో వచ్చును!" అని రాజు సభలో ప్రకటించాడు.

జనానికి రక్కసిబీడు అంటే భయం పోయింది. అందరూ ఎగబడి, భీమయ్య వద్ద తమకు కావలిసిన మేరకు పొలాలు బాడుగకు తీసుకున్నారు. ఆ బాడుగలతో అతను సంపన్నుడై పోయాడు. కాలక్రమాన రక్కసిబీడుకు "పక్షిమాన్యం" అని పేరు వచ్చేసింది.





# ఎవరుగొప్ప?

ఒకనాడు ఒక రైతు దూరాన ఉన్న పట్టణానికి పోతూ ఉండగా దారిలో అతనికి ఒక వ్యాపారీ, ఒక ఉపాధ్యాయుడూ తగిలారు. ముగ్గురూ కబుర్లు చెప్పుకుంటూ నడక సాగించారు.

మధ్యాహ్నమయింది. ముగ్గురికీ ఆకలిగా ఉన్నది. ఎవరిదగ్గిరా ఆహారం లేదు. దరిదాపులలో ఒక గ్రామం అయినాలేదు. ఆ స్థితిలో వాళ్ళు ఒక తోట వద్దకు వచ్చారు. అందులో పనసచెట్లున్నాయి.

వాళ్ళు తోటలో ప్రవేశించి, తోటమాలిని కలుసుకుని, తమకు ఆకలిగా ఉన్నదనీ, ఒక పనసపండు ఇచ్చినట్టయితే దాన్ని పంచుకు తిని ఆకలి తీర్చుకుంటామనీ చెప్పారు. తోటమాలి సరేనని, వారికొక పనసపండు ఇచ్చాడు.

రైతు ఆ పండును తీసుకుని కోస్తూ, మిగిలిన ఇద్దరికన్న పెద్దవాటా సంపాదించాలన్న ఉద్దేశంతో, "మన ముగ్గురమూ మూడువృత్తుల వాళ్ళం. నేను వ్యవసాయం చేస్తాను; వ్యాపారి వర్తకం చేస్తాడు; ఉపాధ్యాయుడు విద్య నేర్పుతాడు. ఈ మూడు వృత్తులలో ఏది గొప్పదో వాళ్ళకి పండులో ఒక భాగం అదనం! దీనికి మీ రిద్దరూ ఏ మంటారు?" అన్నాడు. మనిషికి వస్తువుల అవసరం కన్నా, చదువు కన్నా ఆహారం ముఖ్యమైనది గనక, ఆహారం పండించే తనవృత్తే ప్రధానమైనదని వాదించి, పండులో అదనపు భాగం పుచ్చుకుందామని రైతు ఉద్దేశం.

రైతు ఇలా అనేసరికి ఉపాధ్యాయుడు, "నువు చెప్పిన దానికి ఒక కథ చెబుతాను. ఒక గ్రామంలో ఒక ధనికుడుండేవాడు. ఆయనకు ముగ్గురు కొడుకులు. వాళ్ళు బాధ్యత లేకుండా ఇష్టం వచ్చినట్టు తిరుగుతూ ఉండేవాళ్ళు.

ఏ. కామేశ్వరశర్మ

"ధనికుడు వృద్ధుడై పోతున్నాడు. ఆయన పోయిన మరుక్షణం ముగ్గురు కొడుకులూ ఉన్నదంతా అలాములు పలాములు చేసేస్తారు. అలా జరగకుండా చెయ్యటానికి ఆయన ఒక ఉపాయం ఆలోచించాడు.

"ఆయన ఒక్కొక్క కొడుకునే విడివిడిగా పిలిచి, వాడికి తన వాఙ్మూలం చూపాడు. అందులో ఏమిరాసి ఉన్నదంటే, తన మరణానంతరం తన ఆస్తిని నాలుగు భాగాలు చెయ్యాలనీ, తననుండి ఉంగరం పొందినవాడికి ఒక భాగం అదనంగా ఇవ్వాలనీ ఉన్నది.

"ధనికుడు ఒక్కొక్క కొడుకుతోనూ, 'చూడు, నాయనా. నువు బుద్ధిగా ఉండి, బాధ్యత తెలుసుకొని ప్రవర్తించావంటే, ఆ ఉంగరం నీకే ఇస్తాను,' అని చెప్పాడు.

"తరవాత కొంతకాలానికి ధనికుడు చనిపోయాడు. పెద్దవాళ్ళు నలుగురూ కూర్చుని, ధనికుడి వాఙ్మూలం చదివి, ఆయన వదిలి పెట్టిన ఆస్తిని నాలుగు భాగాలు చేసి, ధనికుడి కొడుకులను పిలిచి, 'మీలో మీ తండ్రి నుంచి ఉంగరం సంపాదించినది ఎవరు?' అని అడిగారు.

"'నేనే!' అంటూ ఒకడు ఉంగరం తీసి చూపాడు. 'కాదు, నేను,' అంటూ రెండోవాడూ, మూడోవాడూ కూడా ఉంగరాలు తీసి చూపించారు. ముగ్గురికీ తండ్రి, ఒకరికి తెలియకుండా ఒకరికి, ఉంగరాలిచ్చాడు. అన్నీ ఒకేరకంగా ఉన్నాయి.

"పెద్దలు చేసేది లేక ముగ్గురికీ తండ్రి ఆస్తిని సమంగా పంచారు," అని కథ ముగించి, "మన ముగ్గురి వృత్తులూ మంచివే. దాన్నిగురించి తర్కించవవసరం లేదు. అలాగే మనముగ్గురి ఆకలీ సమానమే. ఒక వృత్తి వాడికి తక్కువ ఆకలీ, మరోవృత్తి వాడికి ఎక్కువ ఆకలీ ఉండదు. అందు చేత పండును సమంగా పంచుకుని తిందాం," అన్నాడు ఉపాధ్యాయుడు.

రైతు తన దురాశకు సిగ్గుపడి, పనస పండును మూడు భాగాలు చేశాడు. వాటిని ముగ్గురూ తిని తమ ఆకలి తీర్చుకుని, ముందుకు సాగిపోయారు.






## 6

[గ్రామాధికారి కుమార్తెను అరణ్యంలో ఎవరో అపహరించుకుపోయారు. వాళ్ళు ఖడ్గ జీవదత్తులై వుంటారని ఆయన వాళ్ళను ఒక పాకలో నిర్బంధించాడు. రాత్రివేళ తమకు కాపలా వున్న తలారిని భయపెట్టి వాళ్ళు పారిపోయేందుకు కంచె ద్వారం దగ్గిరకు వెళ్ళారు. కంచె అవతల అడవిఏనుగు ఒకటి ఘీంకరిస్తూ వాళ్ళ కంటబడింది. తరవాత—]

ఖడ్గవర్మ కత్తితో కంచె ద్వారాన్ని బంధించి వున్న తాళ్ళను గబగబా నరకసాగాడు. ఆ సమయంలో పాక వైపు నుంచి ఒక నల్లని ఆకారం ముందుకొచ్చి, "ఎవరక్కడ? తలారి ఓబన్నా! ఖైదీలు పారిపోతున్నారులా వుంది. నువ్వెక్కడ చచ్చావ్?" అంటూ పెద్దకేక పెట్టింది.

ఆ గొంతు గణకుడిది! ఖడ్గ జీవదత్తులు ద్వారంతాళ్ళు తెగిపోగానే, దాన్ని పట్టుకుని బలంగా వెనక్కులాగి బయిటికి పోబోయారు. ఇంతలో గణకుడు పరుగెత్తుకుంటూ వస్తూ, "ఆగండి! పారిపోజూశారో, మిమ్మల్ని చిత్రవధ చేయిస్తాను!" అంటూ అరిచాడు.

బహుశా అతడి కేకలు అప్పటికే బాగా రెచ్చిపోయి వున్న ఏనుగును మరీంత రెచ్చ కొట్టి వుంటాయి. అది ముందుకాళ్ళతో నేలను ఓసారి గట్టిగా దువ్వి, తొండం ఎత్తి,



భయంకరంగా ఘీంకరిస్తూ, సగం తెరిచి వున్న కంచె ద్వారం కేసి దూకుడుగా వచ్చింది. ఖడ్గ జీవదత్తులు ఒక్క ఉదుటున కంచె మీదికి ఎగిరి కూర్చున్నారు. వాళ్ళను పట్టుకోవాలన్న కోపంలో వెనకా ముందులు చూనుకోకుండా, కేకలు పెడుతూ వేగంగా పరిగెత్తుకొస్తున్న గణకుడు, సరిగ్గా కంచె ద్వారం దగ్గర దానికి ఎదురయ్యాడు.

ఆ పరిస్థితుల్లో జరగబొయ్యే ఘోరం ఊహించుకుని జీవదత్తుడు తల పక్కకు తిప్పుకున్నాడు. ఖడ్గవర్మ మాత్రం పెద్దగా చప్పట్లు చరిచి, "వీ డెవడో గ్రామగణకుడి రూపంలో వున్న భీముడై వుండాలి! అడవి ఏనుగుతోనే మల్లయుద్ధం చేయబోతున్నాడు!" అన్నాడు.

అంతలో గణకుడు ఒక్క చావుకేక పెట్టాడు. కంచెద్వారం దాటగానే, తనను కవ్విస్తున్నట్టు మీదికొస్తున్న గణకుణ్ణి ఏనుగు తొండంతో పట్టుకుని పైకెత్తి విసిరి వేసింది. గణకుడు కీచుమని అరుస్తూ, పోయి తలారి వున్న చెట్టుకొమ్మల మీద పడ్డాడు. అదృష్టవశాన అతడి కేమీ అపాయకరమైన దెబ్బలు తగలలేదు.

ప్రాణభయంపోయి, కాస్త వూపిరి పీల్చుకునే వీలు చిక్కగానే గణకుడు చెట్టు కొమ్మల మీద వూగుతూ, "వీరభద్ర రామభద్రులు పారిపోతున్నారు! అడవి ఏనుగు గ్రామంలో జొరబడింది!" అంటూ కేకలు వేయసాగాడు.

వూరిపాక మీదపడి చిందరవందర చేస్తూ ఏనుగు పెట్టే ఘీంకారాలూ, చెట్టు మీది నుంచి గణకుడు వేసే కేకల్తో, ఆ చుట్టు పక్కల ఇళ్ళవాళ్ళంతా మేల్కొని, చప్పున దివిటీలు వెలిగించుకుని, ఈటెలూ, కత్తులూ, కర్రలూ తీసుకుని ఇళ్ళల్లో నుంచి బయిటికి వచ్చారు.

"పారిపోతున్న రాజద్రోహుల్ని ముందు పట్టుకోండి! తరవాత ఏనుగు సంగతి చూడొచ్చు." అంటూ మరింత పెద్దగా అరవసాగాడు గణకుడు. గ్రామస్తులు చిన్న

చిన్న ముక్కలుగా చీలి, కొందరు ఏనుగు కేసీ, మరికొందరు బార్లా తెరిచి వున్న కంచె ద్వారం కేసీ రాసాగారు.

అప్పటివరకూ ఈ గలభా అంతా చూస్తూ వినేదిస్తున్న ఖడ్గ జీవదత్తులకు, ఇక కంచె మీద వుండటం క్షేమం కాదనిపించింది. ఇద్దరూ కంచె మీది నుంచి అవతలివైపుకు దూకేశారు. ఆ మరుక్షణం దాపులనున్న పొదల్లో నుంచి పెద్దపులి ఒకటి గట్టిగా గాండ్రించింది.

"ఛీ ఛీ! ఏమి గ్రామం! ఏ మరణ్యం! అంతా పులులూ, ఏనుగులమయంగా వుంది!" అన్నాడు ఖడ్గవర్మ విసుక్కుంటూ.

"అలా వుండటంవల్లనే మనం రాజ భటులకూ, యీ గ్రామస్తులకూ దొరక్కుండా పారిపోగలుగుతున్నాం. లేకపోతే వాళ్ళు మనను చెట్టూపుట్టా తిప్పి, లేళ్ళనూ, కుందేళ్ళనూ వేటాడినట్టు వేటాడేవాళ్ళు!" అన్నాడు జీవదత్తుడు.

ఇద్దరూ యిలా మాట్లాడుకునేంతలో పొదలచాటున వుండి గాండ్రిస్తున్న పులి చప్పున బయిటికి వచ్చింది. ఇక ఏ క్షణాన్నయినా అది తమ మీదికి దూకుతుందని గ్రహించిన ఖడ్గవర్మ, చప్పున దాని వెనక్కు పోయి, "జీవా! దీన్ని చంపటమా? కంచె ద్వారం నుంచి గ్రామంలోకి తరమటమా?" అని అడిగాడు.



"అంతా నీ యిష్టం!" అన్నాడు జీవదత్తుడు నవ్వుతూ.

అతడికి గ్రామంలో అడవి ఏనుగు చేస్తున్న భీభత్సం, గణకుడూ, గ్రామస్తులూ పెట్టే కేకలూ వినవస్తున్నాయి. బాగా తెరిచి వున్న కంచె ద్వారం కేసి ఒక్కడూ రావటం లేదు. అందరూ ఏనుగును చుట్టుముట్టి చంపే ప్రయత్నంలో వున్నారు.

పులి పెద్దగా గాండ్రిస్తూ తన కేసి తల తిప్పబోయేంతలో ఖడ్గవర్మ దాని నడుం మీద కత్తితో చిన్నగా పొడిచాడు. ఆ పోటుకు శరీరం చురుక్కుమని, పులి అతడి మీదికి లంఘించబోయింది. అంతలో జీవదత్తుడు దాని గవద మీద దండాన్ని ఆనించి,



బలంగా ముందుకు తోశాడు. కత్తీ, దండం దెబ్బలకు పులి బెదిరిపోయి, ఎదురుగా తెరిచి వున్న కంచె ద్వారం కుండా గ్రామం లోకి పరిగెత్తింది.

ఇక అప్పుడు గ్రామంలో రేగిన గల్లంతు అంతా యింతా కాదు. ఏనుగు ధాటిని తట్టుకోలేక చిందరవందరవుతున్న గ్రామస్తులు, గోండ్రిస్తూ కంచె ద్వారం దాటి లోపలికి వచ్చిన పులిని చూసి, చెల్లాచెదురుగా పారిపోసాగారు. కిందికి దిగటానికి భయపడి, ఇంకా చెట్టుకొమ్మల్లోనే వున్న గణకుడు మరింత పెద్ద గొంతుతో, "మనకు దొరికి పారిపోయిన ఆ ఇద్దరూ, మాంత్రికులు! ఏనుగుల్నీ, పులుల్నీ గ్రామం మీదికి పంపకం చేస్తున్నారు. వాళ్ళు సింహాలనూ, తోడేళ్ళనూ కూడా గ్రామంలోకి తోలక ముందే, కంచె ద్వారాన్ని మూయండి!" అంటూ అరవసాగాడు.

ఆ అరుపులు విని ఖడ్గజీవదత్తులు పొట్టలు చెక్కలయేలా నవ్వుకున్నారు. ఖడ్గవర్మ కత్తి పైకెత్తి చెట్టు మీద వున్న గణకుణ్ణి చూపుతూ, "ఆ పిరికివెధవ, అక్కడుండి అంతగా గొంతుచించుకోకపోతే, కిందికి దిగి గ్రామస్తులకు సహాయపడకూడదా? నా దగ్గిర కత్తితోపాటు, విల్లంబులు కూడా వున్నట్టయితే, ఆ ముసలి ముచ్చు తలను తాటికాయలా ఒక్క బాణం దెబ్బకు కింద పడకొట్టేవాణ్ణి!" అన్నాడు.

"విల్లంబులు సంపాయించటం ఎంత పని! అరణ్యంలో వాటి అవసరం మనకు తప్పక కలుగుతుంది. ఆ ముసలి గణకుడి తల మాట తర్వాతచూద్దాం. ముందు మనం యిక్కణ్ణించి వెళ్ళిపోవటం మంచిది!" అన్నాడు జీవదత్తుడు.

ఇద్దరూ అక్కణ్ణించి కదిలి గుడ్డి వెన్నెల కాంతిలో జాగ్రత్తగా దారి చూసుకుంటూ అరణ్యం కేసి బయలుదేరారు. దారిలో వాళ్ళకు రకరకాల క్రూరమృగాలు కనిపించినై. కాని, నిర్భయంగా ముందుకు పోతున్న వాళ్ళిద్దర్నీ అవి ఒక్కసారి తేరిపారజూసి, దారి తొలిగిపోసాగినై.

సూర్యోదయానికి ఒక జాము ముందుగా వాళ్ళు చాలా దూరం నడిచి, దట్టమైన ఒక అరణ్యప్రాంతాన్ని చేరారు. ఆ ప్రదేశ మంతా మహావృక్షాలతోనూ, చిన్నా పెద్ద కొండలతోనూ భయంకరంగా వున్నది.

"ఖడ్గా, మనం గ్రామం నుంచి రెండు మూడామడల దూరం వచ్చినట్టున్నది. సూర్యోదయానికి మరెంతో కాలం లేదు. ఈ పెద్ద చెట్టు కొమ్మల్లో కొంచెం సేపు పడుకుని విశ్రాంతి తీసుకుందామా?" అన్నాడు జీవదత్తుడు.

ఖడ్గవర్మ అందుకు సరే నన్నాడు. ఇద్దరూ ఒక చెట్టు పైకెక్కి దాని కొమ్మల మధ్య అనుకు కూర్చున్నారు. రాత్రంతా నిద్ర లేకపోవటం వల్లా, అరణ్యంలో చాలా దూరం నడవటం వల్లా యిద్దరూ బాగా డస్సిపోయి వున్నారు. ఆ కారణంచేత వాళ్ళకు వెంటనే కునుకు పట్టింది.

కాలం గడిచింది. ఎవరో గొడవగా మాట్లాడుకుంటున్న ధ్వని చెవులపడి, హఠాత్తుగా జీవదత్తుడు కళ్ళు తెరిచాడు. ఆ వెంటనే ఖడ్గవర్మ కూడా నిద్ర మేల్కొని, జీవదత్తుడి కేసి చూశాడు. జీవదత్తుడు అతడికి మాట్లాడవద్దని సౌంజ్ఞ చేసి, మాటలధ్వని వస్తున్న వైపుకు తల తిప్పి చూశాడు.

ఖడ్గ జీవదత్తులు వున్న చెట్టుకు రాయి వేటు దూరంలో గుంపుగా వున్న చెట్ల మధ్య ఖాళీ స్తలంలో కొందరు మనుషులు కీచులాడుకుంటున్నారు. వాళ్ళు వయసును బట్టి చిన్నా పెద్ద గడ్డాలతో, ముఖాన విభూతి,





కుంకుమలతో, చేతుల్లో త్రిశూలాలతో—చూడ భయంకరంగా వున్నారు. వాళ్ళందరి మెడల్లోనూ రుద్రాక్ష మాలలున్నాయి. ఒకడు మాత్రం తల మీద కూడా రుద్రాక్షలు బిగించాడు. వాడిది అందరి కన్న మరి కాస్త పొడవు గడ్డం. వాడు త్రిశూలం ఎత్తి, తన కన్న కాస్త పొట్టిగడ్డం వాణ్ణొకణ్ణి భయపెడుతూ అరుస్తున్నాడు. కొందరు వాళ్ళ పక్కన చేరి సర్ది జూస్తున్నారు. దూరాన వుండటంవల్ల, ఖడ్గ జీవదత్తులకు వట్టిధ్వని తప్ప, వాళ్ళ మాటలు స్పష్టంగా వినిపించటం లేదు.

ఆ కొట్లాడుకుంటున్న వాళ్ళు భైరవ భక్తులు. ఆ ముఠాకు నాయకుడైన గణలింగేశ్వరుడికి, అతడి ప్రధాన శిష్యుడైన శ్వేతభైరవుడికి కొత్తచోట స్థాపించవలసి వున్న భైరవాలయాన్ని గురించి అభిప్రాయభేదం కలిగింది.

ఈ భైరవులు అయిదారు నెలల క్రితం వరకూ వింధ్యపర్వత ప్రాంతాల్లో వున్న ఒక పురాతన భైరవాలయాన్ని ఆశ్రయించుకుని వుంటూండేవాళ్ళు. ఆ ఆలయానికి ఒక ముసలి పూజారిణి — భైరవి వుండేది. ఆ మధ్య వాళ్ళు ఒక పర్వదినంనాడు భైరవుడి బలి కోసం తెచ్చిన ఒక బాలుణ్ణి బలి పెట్టటానికి ఆమె నిరాకరించింది. అదే రాత్రి, ఆ ప్రాంతాన పెద్ద తుపాను ప్రారంభమై, భైరవాలయం మీద పిడుగొకటి పడి, ఆలయం శిథిలమైపోయింది.

ఈ వైపరీత్యానికి కారణం ముసలిభైరవి బాలుణ్ణి బలి చేయ నిరాకరించటమే అని గణలింగేశ్వరుడు తన ముఠావాళ్ళందరికీ చెప్పి, ఆమెను భైరవుడికి బలి చేయాలని కుట్రపన్నాడు. అది తెలిసిన శ్వేతభైరవుడు, ఆమెను రహస్యంగా ఒక కొండగుహలో దాచి, గురువుతో ఆమె ఎటో పారిపోయిందని చెప్పాడు.

గణలింగేశ్వరుడు ముసలిభైరవి కనిపించకుండా పోవటంలో ఏదో మోసంవుందని అనుమానించినా, ఆధారాలు లేనందున ప్రధాన శిష్యుణ్ణి శిక్షించలేకపోయాడు.

కాని, ఆ తరవాత అందరూ కొత్త భైరవిగా పనికొచ్చే కన్య కోసం వెతుకుతూ, పర్వత ప్రాంతాలు వదిలి గ్రామసీమల కేసి బయలు దేరినప్పుడు—శిష్యుడి మీద ఒక కన్ను వేసి వుంచాడు.

శ్వేతభైరవుడికి నరబలులంటే అసహ్యం. కాని, ఆ పద్ధతిని మార్పించాలంటే సూటిగా భైరవభక్తులందరికీ ఆ మాట చెప్పటం చావు కోరి తెచ్చుకున్నట్టవుతుంది. ఆ కారణంగా అతడు ముందు తమ ప్రధాన గురువైన గణలింగేశ్వరుణ్ణి పదవి నుంచి తొలగించేందుకు రహస్య ప్రయత్నాలు ప్రారంభించాడు.



తన ప్రధాన శిష్యుడు ముఠాలో చిన్న ముఠా మరొకదాన్ని తయారుచేస్తున్నాడని గణలింగేశ్వరుడు, తనకు మరింత విశ్వాస పాత్రులైన భైరవభక్తుల ద్వారా తెలుసుకున్నాడు. అందుకు అవసరం అయిన సాక్ష్యం పోగు చేయటమేగాక, తాము ఒక గ్రామప్రాంతంలోని కొలను దగ్గిర నుంచి అపహరించుకువచ్చిన ఒక కన్యకు, రాత్రి వేళ పారిపోయేందుకు సహాయపడ జూశాడని కూడా అతడు నేరం ఆరోపించాడు.

శ్వేతభైరవుడు గురువుగారి ఆరోపణల్లో నిజం లేదన్నాడు. దానితో గణలింగేశ్వరుడు రెచ్చిపోయి అతణ్ణి త్రిశూలంతో పొడవటానికి సిద్ధపడ్డాడు. శిష్యులు కొందరు అతణ్ణి వారించి, నిజానిజాలు తెలుసుకునేందుకు తాము అపహరించుకు వచ్చిన కన్యనే ప్రశ్నిద్దామన్నారు.

గణలింగేశ్వరుడు గట్టిగా చప్పట్లు కొట్టాడు. ఆ వెంటనే త్రిశూలం ధరించిన ఒక యువభైరవుడు చెట్లచాటు నుంచి వచ్చాడు. వాడికి గణలింగేశ్వరుడు కన్యను తమ ముందుకు తీసుకురమ్మని ఆజ్ఞ యిచ్చాడు. వాడు తిరిగిపోయి పదహారూ పదిహేడేళ్ళ వయసు గల ఒక పిల్లను గురువు దగ్గిరకు తీసుకువచ్చాడు.

గణలింగేశ్వరుడు ఆమెతో, "రాత్రి నువ్వు పారిపోవాలని చూశావు గదా? అందుకు శ్వేతభైరవుడు నీకు సహాయం చేస్తానన

లేదా? అబద్ధరి ఆడకుండా నిజం చెప్పు. లేకపోతే మహాభైరవుడు నీ నెత్తి అణు స్తాడు," అన్నాడు.

ఆ పిల్ల తాను పారిపోజూసిన మాట నిజ మేననీ, కాని అందుకు ప్రోత్సహించిన వాళ్ళుగానీ, సహాయ పడతామన్నవాళ్ళుగానీ ఎవరూలేరనీ చెప్పింది. ఆ జవాబు ఒక్క గణలింగేశ్వరుణ్ణి తప్ప భైరవుల ముఠాలో చాలామందిని సంతృప్తిపరిచింది.

గణలింగేశ్వరుడు ఆ అమ్మాయిని అవ తలకు తీసుకుపొమ్మని యువభైరవుడితో చెప్పి, శ్వేతభైరవుడి కేసి గుర్లురుముతూ, అతడు నడుముకు జందెంలా వేసుకున్న రుద్రాక్షల తాడును. గట్టిగా పట్టుకుని, "నా తర్వాత నువ్వు యీ భైరవభక్తులకు గురువయ్యే అవకాశం ఏమీ లేదు. నువ్వు ద్రోహివి! నిన్నిప్పుడే శాస్త్రోక్తంగా భైరవు డికి బలి యివ్వగలను. కాని—నీవంటే యింకా విశ్వాసం వున్నవాళ్ళు భక్తుల్లో కొందరున్నారు గనక, ప్రస్తుతానికి నిన్ను ప్రాణాలతో వదులుతున్నాను," అన్నాడు.

శ్వేతభైరవుడు నిప్పులు చెరిగే కళ్ళతో గురువు ముఖం కేసి చూస్తూ, త్రిశూలాన్ని అతడి గుండెల్లో గుచ్చేందుకు ఎత్త బోయాడు. కాని, అతడి మిత్రుడొకడు, ఆ పని తగదన్న సూచనగా అతడి భుజం మీద చేయివేసి సముదాయించాడు.

ఈ కీచులాటంతా చెట్టు మీద వున్న ఖడ్గ జీవదత్తులకు కనబడుతూనే వున్నది. కాని భైరవుల సంభాషణ మాత్రం వాళ్ళకు విన బడలేదు. ఒక పిల్లను చెట్లచాటు నుంచి భైరవు డొకడు గుంపు దగ్గిరికి తేవటం చూస్తూనే, ఆ పిల్ల తమను బందీలను చేసిన గ్రామాధికారి కూతురై వుంటుందని వాళ్ళు వూహించారు.

"ఖడ్గా! ఆ పిల్లను ఎలాగైనా మనం యీ నరబలిగాళ్ళ నుంచి కాపాడాలి!" అన్నాడు జీవదత్తుడు.

"తప్పకుండా! ఆ అవసరంలో వీలైతే యీ భైరవుల్లో కొందర్ని వనదేవతలకూ, పులితోడేలుమాతలకూ ప్రసాదంగా ఇద్దాం!" అన్నాడు ఖడ్గవర్మ. —(ఇంకా వుంది)





# లక్ష్మీసరస్వతులు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నీ ప్రయత్నం సఫలమైతే దక్కిన ఫలితాన్ని అనుభవిస్తావో లేక విజయశ్రీ లాగా జారవిడుస్తావో అని నాకు సందేహంగా ఉన్నది. నీకు శ్రమ తెలియకుండా ఉండ గలందులకు ఆమె కథ చెబుతాను, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు :

ఉజ్జయినీనగరంలో ఒక పేద పండితుడు ఉండే వాడు. అయనకు విజయశ్రీ అనే కుమార్తే, ఆమె తరవాత ఇద్దరు కుమారులూ ఉండేవారు. విజయశ్రీ తమ ఇంట తరచుగా పండితులు చేరి చేసే చర్చలు ఆలకించేది. ఆమె ఏకసంతగ్రాహి కావటంచేత ఒకసారి విన్నది మరి మరిచిపోయేది కాదు. ఆమె

## బేతాళ కథలు



పెరుగుతూ వస్తున్న కొద్దీ ఆమెలో అసాధారణమైన కవితాశక్తి ఏర్పడింది. ఆమె ఆశువుగా శ్లోకాలు చెప్పటం ప్రారంభించి, చిన్న చిన్న ప్రబంధాలు రచించే స్థితికి వచ్చింది. ఆమె రచనలు చదివినవారు ఆమెను సరస్వతీ అవతారమని పొగడటం ప్రారంభించారు.

ఆమె తన తండ్రి వెంట చిన్న, పెద్ద పండితసభలకు వెళ్ళేది. ఆ విధంగా ఆమె ప్రతిభగల కవయిత్రి అన్నవిషయం బాగా ప్రచారంలోకి వచ్చింది. ఈ ప్రతిభకు తోడు ఆమె యుక్త వయస్కురాలయే సరికి దేవకాస్త్రీ అని భ్రమింపజేసేటంతటి సౌందర్యవతిగా తయారయింది. పదిమంది మెచ్చే కవిత్వం రాస్తుందనీ, అసాధారణ సౌందర్యవతి అనీ అనేకమంది ఆమెను వివాహమాడగోరారు. కాని ఆమె చంద్రశేఖరుడనే యువకుణ్ణి మనసులో తన భర్తగా వరించింది. దురదృష్టవశాన చంద్రశేఖరుడు కూడా పేదరికంలో మునిగి తేలున్నవాడే, కాని అతనికి ఆమె కవిత్వం పంచప్రాణాలు. అందుచేత కవయిత్రిగా తనకు కొంత రాబడి ఏర్పాటయినప్పుడు పెళ్ళి చేసుకుందామని మనసులో తీర్మానించుకున్నది.

ఇలా ఉండగా ఆ దేశపు రాజుగారికి విజయశ్రీని గురించీ, ఆమె కవితాసామర్థ్యం గురించీ తెలియవచ్చింది. అప్పుడు రాజుగారు తాను ఏటా జరిపే పండితసభకు ఇతర కవులతోబాటు విజయశ్రీని కూడా ఆహ్వానించాడు.

రాజుగారు తనను సత్కరించినట్టయితే తమ దారిద్ర్యం కొంతవరకు తీరుతుందనీ, అప్పుడు తాను కోరినవాణ్ణి పెళ్ళాడవచ్చుననీ విజయశ్రీ ఆశించింది. ఆమె రాజుగారి పండిత సభకు వెళ్ళింది. పండిత చర్చలు జరిగేటప్పుడు పెద్దల అనుమతితో విజయశ్రీ కూడా తన అభిప్రాయాలు చెప్పి పండితులను ఆశ్చర్యపరచింది.

ఆటుతరవాత కావ్యపఠనం జరిగింది. అప్పుడు మిగిలిన కవులతోబాటు విజయశ్రీ

తన రచనలు కూడా చదివింది. ఆమె కవిత్వానికి పండితులు అమితాశ్చర్యమూ, ఆనందమూ ప్రదర్శించారు. ఇదంతా చూసి రాజుగారు ముగ్ధుడై, విజయశ్రీకి అనేక బహుమతులిచ్చి, ఆమెను కొంత కాలం పాటు తన భవనంలో అతిథిగా ఉండమని కోరాడు.

కవయిత్రిగా తన జన్మసార్థకం అయినట్టు భావించి, విజయశ్రీ రాజుగారి ఆతిథ్యాన్ని కృతజ్ఞతతో స్వీకరించింది.

రాజభవనంలో అడుగు పెట్టగానే విజయశ్రీ జీవితం పూర్తిగా మారిపోయింది. అతిత్వరలోనే ఆమె దారిద్ర్యం ఎలా ఉంటుందో కూడా మరిచింది. అంతఃపురంలో ఆమెకు అనేక దాసీలు. వాళ్ళు రోజూ ఆమెకు షోడశోపచారాలు చేసేవారు; దివ్యమైన బట్టలు కట్టబెట్టేవారు, నగలు ధరింపజేసేవారు, ఎక్కడికి వెళ్ళాలన్నా అందలాలలో తిప్పేవారు. రోజూ ఆమెకు నృత్యగాన వినోదాలు ఉండేవి. స్వర్గసుఖం ఇంతకన్న ఎలా ఉంటుందో ఆమె ఊహించ లేకపోయింది. రోజూ యువరాజు ఆమె వద్దకు వచ్చి, ఆమెకు తెలియని వేటలను గురించీ, యుద్ధాలను గురించీ కబుర్లు చెప్పేవాడు.

ఈ వాతావరణంలో విజయశ్రీకి పునర్జన్మ ఎత్తినట్టయింది. ఇందులో పాండిత్యం



గురించీ, కవిత్వం గురించీ చర్చలులేవు; ఆమె పాతజీవితాన్ని జ్ఞాపకం చేసేది ఏదీ లేదు. పూర్వంలాగా ఆమెనోట శ్లోకాలు ఆశువుగా రావటం కూడా మానేశాయి.

ఈ నూతనజన్మకు ఒక పువ్వుపూసిన చందంగా ఒకనాడు యువరాజు, తనకు ఆమెను వివాహమాడాలని ఉన్నదనీ; అందుకు రాజుగారి అనుమతి, రాణిగారి అనుమతీ లభించిందనీ ఆమెతో అన్నాడు. విజయశ్రీ ఆశ్చర్య చకితురాలై, తన అభిప్రాయం మర్నాడు చెబుతానన్నది.

ఆమె ఆ రాత్రల్లా నిద్రమాని ఆలోచించి ఒక నిష్ణయానికి వచ్చి, తెల్లవారగానే రాణీగారి దర్శనం చేసుకుని, తనకు యువ

...తను వివాహం చేసుకునే ఉద్దేశం లేదనీ, తనకు రాజభవనంలో దొరికిన సత్కారానికి కృతజ్ఞురాలననీ, తనను వెంటనే తన యింటికి పంపివేయవలసిందనీ విన్నవించుకున్నది.

ఆ రోజే రాజుగారు విజయశ్రీని సగౌరవంగా ఆమె తండ్రి వద్దకు పంపేశాడు. తరవాత కొద్ది కాలానికి ఆమెకూ, చంద్రశేఖరుడికీ వివాహం జరిగింది.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, విజయశ్రీ అంత అవివేకంగా ఎందుకు ప్రవర్తించింది? కొద్ది రోజులపాటు రాజభోజనం వంటబట్టగానే ఆమెకళ్ళు నెత్తికివచ్చాయా? లేక పేదరికాన్ని పూర్తిగా మరిచిపోవటం చేత ఆమె తిరిగి పేదదశకు వెళ్ళిపోవటం ఎలా ఉంటుందో గ్రహించలేక పోయిందా? లేక, తానై వరించటం చేత యువరాజు ఆమెకు లోకువయాడా? ఆమె తల్లవార్లూ ఏమి ఆలోచించి ఉంటుంది? ఈ అనుమానాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది." అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "విజయశ్రీ వివేకంగానే ప్రవర్తించింది. యువరాజు ఆమె అందం చూసి మోహించిన మాట నిజమేగాని, ఆమె రాజభవనంలో అడుగు పెట్టటానికి కారణం ఆమె పాండిత్య, కవిత్వాలు. రాజభవనంలో ఆమెకు ఆ రెండూ కరువైనా కూడా అక్కడి జీవితం ఆమెకు స్వర్గతుల్యంగానే కనబడింది. యువరాజు తనను పెళ్ళాడతా ననగానే ఆమెకు తన గత జీవితం గుర్తువచ్చి ఉంటుంది; చంద్రశేఖరుడూ గుర్తువచ్చి ఉంటాడు. యువరాజును పెళ్ళాడటమంటే సరస్వతిని కాలదన్ని లక్ష్మికి పాదాక్రాంతురాలు కావటమేనని ఆమె స్పష్టంగా తెలుసుకుని ఉండాలి. అయితే లక్ష్మిని కాలదన్నటం కూడా అంత తేలికకాదు. ఆ పని చెయ్యటానికి తీర్మానించుకునేటందుకే ఆమె ఒక రాత్రంతా ఆలోచించవలసి వచ్చింది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# ఆరితేరిన దొంగ

రుమానియా రాజధాని నగరంలో ఒక ఆరితేరిన దొంగ ఉండేవాడు. అతను ఒకనాడు ఒక పల్లెటూరికి పోతూ దారిలో మరొక దొంగను కలుసుకున్నాడు. ఆ పల్లెటూరి దొంగ పట్టణంలో తన వృత్తి కొనసాగింతామని వస్తున్నాడు. ఇద్దరూ మాట్లాడుకోవటంలో వారిది ఒకే వృత్తి అని స్పష్టమయింది.

పట్టణం దొంగ పల్లెటూరి దొంగతో, "నీ నేర్పు చూద్దాం. ఆ చెట్టు మీది కాకి గూడు నుంచి కాకికి తెలీకుండా దాని గుడ్లు దొంగిలించుకురా," అన్నాడు. పల్లెటూరి దొంగ చెట్టెక్కి, కాకి గూడు చేరి, పొదుగుతున్న కాకికి తెలియరాకుండా దాని గుడ్లు కాజేసి, జేబులో వేసుకుని చెట్టు దిగి వచ్చాడు. కాని వాడు కిందికి దిగి వచ్చి జేబులో చూసుకుంటే గుడ్లు లేవు. పట్టణం దొంగ వాటిని తన చేతిలో చూపిస్తూ, "ఫరవాలేదు. నువు వేర్పుగల దొంగవే. దొంగతనాలలో నాకు కుడిభుజంగా ఉన్నావంటే నీకు వాటా ఇస్తాను," అన్నాడు. ఇందుకు పల్లెటూరిదొంగ ఒప్పుకున్నాడు.

ఇద్దరూ కలిసి ఆ రాత్రి రాజుగారి ఖజానా దోచటానికి నిశ్చయించారు. చీకటి పడగానే వాళ్లు ఒకపక్క నుంచి రాజుగారి భవనం పై కప్పు మీదికి ఎక్కి, కప్పులో ఉండే అద్దపుకిటికీల కుండా ఒక్కొక్కగదే చూస్తూ, చివరకు ఖజానా కొట్టు తెలుసుకున్నారు. అందులో పీపాల నిండా బంగారపు నాణాలున్నాయి.

పెద్ద దొంగ చిన్న దొంగను తాడు సహాయంతో అద్దపు కిటికీకుండా ఖజానా కొట్టులోకి దించాడు. చిన్న దొంగ ఒక సంచీ నిండా బంగారు నాణాలు నింపుకుని తిరిగి కప్పుచేరుకున్నాడు. తరవాత ఇద్దరూ రాజభవనం దిగి వెళ్ళిపోయారు.

రుమానియా జానపద కథ



మర్నాడు పూర్వాహ్ణం వేళ రాజుగారు రోజులాగే తన ఖజానా చూసుకోవటానికి వచ్చి, "ఈ గదిలోకి ఎవరు వచ్చారు?" అని అడిగాడు.

"ఎవరూ రాలేదు, మహారాజా," అన్నాడు కాపలావాడు.

రాజు ఖజానా నుంచి కారాగృహానికి వెళ్ళి, అక్కడ ఖైదు చేసి వున్న ఒక ముసలి దొంగతో, "ఎవరో ఖజానాలో ప్రవేశించి రెండువేల చిల్లర బంగారు నాణాలు కాజేసుకుపోయారు. గోడలో ఎక్కడా కన్నం లేదు," అన్నాడు.

"కన్నం ఉండే ఉంటుంది, మహారాజా మీరు కనుక్కోలేదు. అంతే. ఖజానా కొట్టులో పొగపెట్టి, పొగ ఎటుగా బయటికి వస్తుందో గమనించండి. కన్నం ఎక్కడ ఉన్నదీ తెలిసిపోతుంది," అన్నాడు దొంగ.

రాజు అలాగే చేసేసరికి, కప్పులోని అద్దం కిటికీ కుండా పొగ పైకి వచ్చింది. రాజు ఈ మాట చెప్పేసరికి ముసలి దొంగ, "ఆ దొంగ మళ్ళీ వచ్చి తీరుతాడు. ఆ కిటికీ అద్దాన్ని తాపడం చేయించకుండా అలాగే ఉండనిచ్చి, కిటికీ దిగువన పెద్ద పీపాలో చిక్కని బెల్లపుపాకం పోసి ఉంచండి. దొంగ తిన్నగా అందులోకి దిగబడి, మీకు చిక్కిపోతాడు," అన్నాడు.

ముసలి దొంగ అన్నట్టుగానే జరిగింది. దొంగలిద్దరూ కూడబలుక్కుని, "ఆ ఖజానాలో ఇంకా చాలా బంగారం ఉన్నది. రాజుకు దొంగతనం గురించి తెలిసేలోపుగా మనం మరి కొంత కొల్లగొట్టటం మంచిది," అనుకుని, మరుసటి రాత్రి మళ్ళీవచ్చారు.

చిన్నదొంగ తాడు మీదినుంచి దిగి తిన్నగా బెల్లపుపాకంలో దిగబడ్డాడు.

"అన్నా, మోసం జరిగింది. నేను కదల లేకుండా ఎందులోనో కూరుకుపోయాను. నన్ను పైకి లాగటం సాధ్యంకాదు. నేను ప్రాణాలతో దొరకకుండా, ఇంత విషం ఇచ్చి నువు తప్పించుకు పో!" అన్నాడు వాడు.

"భయంలేదు, తమ్ముడూ. భయపడకు. నా దగ్గిర చచ్చినట్టుగా కనపడేటట్టు చేసే

మందున్నది. అది మింగు. రేపు నేను వచ్చి నిన్నురక్షిస్తాను,'' అని పెద్దదొంగ, తాడు మీదిగా దిగివచ్చి చిన్నదొంగకు ఏదో మందిచ్చి, వెళ్ళిపోయాడు. ఆ మందు మింగగానే చిన్నదొంగ శరీరం కొయ్యబారి పోయి. ఊపిరి ఆగిపోయింది.

మర్నాడు ఉదయమే రాజు ఖజానా కొట్టుకువచ్చి, పీపాలో చిక్కుకు పోయిన దొంగను చూసి, "ఆహా! దొంగ దొరికాడు! వెధవా, నీ అంతు తేలుస్తానుండు," అన్నాడు. కాని దొంగ చచ్చి ఉండటం గమనించగానే రాజుగారి ఉత్సాహం చల్లారింది. అయన ఖైదుకు వెళ్ళి ముసలి దొంగతో సంప్రతించాడు.

"మహారాజా, వీళ్ళెవరో చాలా తెలివైన దొంగలు!" అన్నాడు ముసలిదొంగ.

"దొంగలా? వీడుగాక ఇంకోడున్నాడంటావా?" అన్నాడు రాజు తెల్లబోయి.

"ఇంకొకడు లేకపోతే వీడెలా చచ్చాడంటారు? ఆత్మహత్య చేసుకోలేడు గదా? బెల్లపుపాకంలో కూరుకుపోయిన మాత్రాన ప్రాణాలు పోవుగదా! అయినా ఆ రెండో వాణ్ణి పట్టేమార్గం ఉన్నది లెండి. వీడి శవం కోసం వాడు తప్పక వస్తాడు. నగర ద్వారం బయట వీడిశవాన్ని ఒక కుర్చీలో పెట్టి, దానికి భటులను కావలి పెట్టండి," అన్నాడు ముసలిదొంగ.



ముసలిదొంగ చెప్పినట్టే, పెద్ద దొంగ తన మిత్రుణ్ణి కాపాడే ప్రయత్నాలు ప్రారంభించాడు. వాడు ఒక తెల్ల గుర్రాన్నీ, బండినీ, నాలుగుజాడీల సారానూ కొన్నాడు. తరవాత అతను ముసలివేషం వేసుకుని, సారా జాడీలను బండి మీద పెట్టుకుని, బండిని తోలుకుంటూ వెళ్ళి, నగర ద్వారానికి యాభైగజాల దూరంలో బండిని పక్కకు ఒరగవేసి, "అయ్యో, నా బండి పడిపోయింది. సారాజాడీలు పడిపోయాయి! రక్షించండి!'' అని కేకలు పెట్టాడు.

చిన్నదొంగకు కాపలా ఉన్న భటులు, "ఒరే, ముసలాడా! మాకు ఒక సారా జాడీ ఇస్తే, నీ బండి సరిచేస్తాం," అన్నారు.



"ముసలాడా, నీకు మతిపోయిందా ఏం? వాడు చచ్చాడు, కనబడటం లేదూ? చచ్చిన దొంగ నీ గుర్రాన్ని ఎలా ఎత్తుకు పోతాడూ?" అన్నాడు సర్దారు.

"వాడు తప్పక నా గుర్రాన్ని ఎత్తుకు పోతాడు. దొంగను నమ్మరాదు." అన్నాడు పెద్ద దొంగ.

"నోరు మూసుకో, ముసలాడా! వాడు నీ గుర్రాన్ని కాజేస్తే నేను నీకు గుర్రం ఖరీదిస్తాను, సరేనా?" అన్నాడు సర్దారు.

తరవాత భటులు ఒక్కొక్కరే నిద్ర మత్తుతో ఒళ్ళు తెలియకుండా పడిపోయారు. వెంటనే పెద్దదొంగ చిన్న దొంగను సమీపించి, అతని నోట్లో ఏదో ద్రావకం పోశాడు. కొద్ది సేపటి కల్లా చిన్న దొంగ కదిలి, కళ్ళు తెరిచాడు.

"చూడు, తమ్ముడూ, వీళ్ళు ఎంతో సేపు మత్తులో ఉండరు. నువు గుర్రాన్ని ఎక్కి మన చోటికి వెళ్ళిపో. ఉదయం కాగానే నేను వచ్చి కలుసుకుంటాను," అన్నాడు పెద్దదొంగ చిన్నదొంగతో. చిన్న దొంగ గుర్రాన్ని ఎక్కి బయలుదేరగానే పెద్ద దొంగ యథాస్థానానికి వచ్చి, నిద్రపోతు న్నట్టు నటించాడు.

తరవాత కొంతసేపటికి భటులు ఒక్కొ క్కరికీ స్పృహ వచ్చింది. చచ్చిపోయిన దొంగతో బాటు గుర్రం కూడా మాయం

"నేను కాదన్నానా, బాబుల్లారా? ఒక జాడీ ఇస్తాను, నాకు సాయం చెయ్యండి," అన్నాడు పెద్ద దొంగ.

భటులు బండిని సరిగా నిలబెట్టి, సారా జాడీలు మూడు దాని మీద పెట్టేసి, నాలు గోది మాత్రం తాము తీసుకుని, వంతు ప్రకారం తాగసాగారు. దొంగ ఆ సారాలో నిద్రమత్తుమందు కలిపిన సంగతి వాళ్ళెర గరు. భటులకు నిద్రమత్తు వస్తూన్న సమ యంలో పెద్ద దొంగ చిన్న దొంగను చూపి, "సర్దారుగారూ, ఇతగాడెవడు?" అన్నాడు.

"వాడొక దొంగలే!" అన్నాడు సర్దారు.

"అయ్యో, వీడు నా గుర్రాన్ని ఎత్తుకు పారిపోతాడేమో!" అన్నాడు పెద్ద దొంగ.

కావటం చూసి వాళ్ళు అదిరిపడ్డారు. సర్దారు కళ్లు నులుపుకుని మళ్ళీ చూసి, "ముస లాడు అన్నంతా అయిందే!" అన్నాడు.

అతను లేచి వెళ్ళి నిద్ర నటిస్తున్న పెద్ద దొంగను లేపి, "నా కంతా అయోమయంగా ఉంది. ఎలా అన్నావే గాని, నువు అన్నంతా అయింది. దొంగా లేదు, గుర్రమూ లేదు. పోతే పోయారు, కాని రాజుగారికి ఇక్కడ జరిగినది తెలిస్తే తోలు వలిచేస్తారు. ముస లాడా, నీ గుర్రానికి రెట్టింపు ఖరీ దిచ్చు కుంటాను, ఇక్కడ జరిగినది మాత్రం బయటపెట్టకు," అని ప్రాథేయపడ్డాడు.

పెద్దదొంగ తాను వచ్చిన పని పూర్తి చేసుకోవటమే గాక అయిదు వందల నాణాలు కూడా సంపాదించుకుని వెళ్ళి పోయాడు.

రాజు జరిగిన సంగతి చెప్పేసరికి ముసలి దొంగ, "వాడెవడో ఆరితేరినవాడని నేను ముందే చెప్పలేదా? పెద్ద బహుమానం ఇస్తానని ప్రకటన చేస్తే గాని వాడు తమ కళ్ళపడడు," అన్నాడు.

రాజుకు కూడా ఈపాటికి దొంగ మీద చాలా ఆదరం ఏర్పడింది. ఆయన దొంగకు పెద్ద బహుమానం ప్రకటించాడు.

పెద్దదొంగ వచ్చి, "మహారాజా, నేనే దొంగను. తాము ఇచ్చే బహుమానం అందు కుందామని వచ్చాను," అన్నాడు.

"నువే దొంగవని నా కెట్లా రుజువు?" అని రాజు దొంగను అడిగాడు.

దొంగ దూరంగా ఒక ఎద్దును తోలుకు పోతున్నవాణ్ణి చూపించి, "ఆ ఎద్దును దొంగి లించుకు రాగలను," అన్నాడు. ఆ ఎద్దును తోలుకుపోతున్నవాడు చిన్నదొంగే.

"ఆ ఎద్దును తెస్తే నేను నీ మాట నమ్ముతాను," అన్నాడు రాజు.

పెద్దదొంగ వెళ్ళి ఎద్దును తోలుకుపోయే వాడితో ఏదో అనటమూ, ఎద్దును తోలుకు పోయేవాడు నెత్తీ, నోరూ బాదుకుని పారి పోవటమూ, చూసి రాజు తృప్తిపడ్డాడు. ఆయన దొంగకు అంతులేని బహుమానం ఇచ్చి పంపేశాడు. దాన్ని దొంగ లిద్దరూ పంచుకుని సుఖంగా జీవించారు.



# లోభికి మూడందాల నష్టం

ఒక గ్రామంలో ఒక నేతివర్తకుడు ఉండేవాడు. అతను లోభగుణం కలవాడు కావటాన తాను అమ్మే నేతిలో చౌక నూనె కలిపి అమ్మేవాడు. ఆ నెయ్యి కంపు కొట్టేది. చివరకు ఆ నేతి వర్తకుణ్ణి అధికారులు పట్టుకున్నారు.

న్యాయాధికారి అతనికి మూడు రకాల శిక్షలు చెప్పి, అందులో ఏదో ఒకటి కోరు కొమ్మన్నాడు. అవేమంటే, తక్కెడు కంపు నెయ్యి తాగటం; లేదా, నూరు కొరడా దెబ్బలు తినటం; లేదా, నూరు రూపాయలు జరిమానా చెల్లించుకోవటం.

డబ్బు పోగొట్టుకోవటమూ, శరీరాన్ని బాధ పెట్టుకోవటమూ ఇష్టంలేక వర్తకుడు తక్కెడు కంపు నెయ్యి తాగటానికి ఒప్పుకున్నాడు. కాని చటాకు నెయ్యి తాగేసరికే అతనికి వాంతి వచ్చింది; అందుచేత, కొరడా దెబ్బలు తినటానికి సిద్ధపడ్డాడు. కాని నాలుగు కొరడా దెబ్బలకే అతనికి ప్రాణంపోయినంత పని అయింది. అందుకని ఆ నేతి వర్తకుడు నూరు రూపాయలూ జరిమానా ఇచ్చుకుని, మూడు రకాల శిక్షా అనుభవించాడు.

—బుస్సారి మహేందర్‌జీ





# రాజుగారి యుక్తి

ఒక నగరంలో ఒక నగలవర్తకుడు ఉండే వాడు. అతను నగలవ్యాపారం చెయ్యటమే గాక, నగలు కుదువ పెట్టుకొని కొద్ది వడ్డీకి అప్పులు కూడా ఇచ్చేవాడు. అయితే అతను అమాయకులూ, అసహాయులూ అయిన బాకీదార్లను మోసం చేసేవాడు. ఆ పని ఎలా చేసేవాడంటే, వాళ్ళు బాకీ తీర్చినప్పుడు వాళ్ళు తాకట్టు పెట్టిన అసలు నగలకు బదులు, మాయబంగారంతో చేసిన నకిలీ నగలు ఇచ్చేవాడు. వాళ్ళు ఆ సంగతి తెలుసుకునేవాళ్ళు కారు.

ఒకసారి జయంతుడనే యువకుడు నగల వర్తకుడి దగ్గిర ఒక ముత్యాలహారం కుదువ పెట్టి అప్పు తీసుకుని వాడుకున్నాడు. ఆ యువకుడు పలుకుబడి గలవాడు కాడని గ్రహించి, నగలవర్తకుడు దానిలాటిదే నకిలీహారం, మాయముత్యాలతోనూ, మాయ బంగారంతోనూ చేయించి ఉంచి, ఆ యువకుడు డబ్బు తెచ్చి ఇచ్చినప్పుడు దాన్ని అతనికి ఇచ్చేశాడు.

జయంతుడు దాన్ని పరీక్షించి, "ఇది నే నిచ్చిన హారం కాదు. నే నిచ్చిన దానిమీద మా తాతగారి పేరున్నది. నా హారం నాకు తిరిగి ఇయ్యి," అని పేచీపెట్టాడు. కాని నగలవర్తకుడు అందుకు ఒప్పుకోలేదు.

జయంతుడు ఆ హారాన్ని కంసాలికి చూపితే, బంగారం కాదనీ, మంచిముత్యాలు కావనీ చెప్పాడు. వెంటనే అతను రాజుగారి వద్దకు వెళ్ళి, నగల వర్తకుడు తనను మోసం చేశాడని ఫిర్యాదు చేశాడు.

రాజు నగల వర్తకుణ్ణి పిలిపించి అడిగాడు.

"మహారాజా, ఎంతోమంది వస్తువులు తాకట్టుపెట్టి నా దగ్గిర అప్పులు తీసు కుంటారు, బాకీ తీర్చి తమ నగలు తాము పట్టుకుపోతారు. ఈ కుర్రవాడెవరో కూడా

బి. వెంకటేశ్వరరావు

నాకు తెలీదు. నే నెందుకు మోసం చేస్తాను?" అన్నాడు నగలవర్తకుడు.

"ఇతను నీ కిచ్చిన హారం మీద ఇతని తాతపేరున్నదిట. అది మంచి బంగారం తోనూ, మంచి ముత్యాలతోనూ చేసిన హారమట. ఇది మాయ బంగారంతోనూ, మాయ ముత్యాలతోనూ చేసిన హారమన టానికి సందేహం లేదు. దీనిమీద ఏ పేరూ లేదు. దానికే మంటావు?" అన్నాడు రాజు.

"అలా అయితే, ఈ కుర్రవాడు నా వద్ద పనికిమాలిన హారం తాకట్టుపెట్టి డబ్బు పుచ్చుకున్నాడన్న మాట! ఎంత మోసం! ఎంత మోసం!" అన్నాడు నగలవర్తకుడు.

రాజు నగలవర్తకుడితో, "అలా అయితే నీ దేమీ తప్పు లేదు. మీరిద్దరూ వెళ్ళి పోవచ్చు," అని నగల వర్తకుడితోనూ, జయంతుడితోనూ అన్నాడు. నగలవర్తకుడు సంతోషంగా ఇంటికి వెళ్ళాడు, జయంతుడు హతాశుడై వెళ్ళిపోయాడు.

వాళ్ళు వెళ్ళగానే రాజు తన మంత్రితో, "ఈ నగలవర్తకుడు పచ్చిదొంగ! వీణ్ణి పట్టాలి!" అన్నాడు.

మంత్రి ఆశ్చర్యపోయి, "ఎలా తెలుసు కున్నారు?" అన్నాడు.

"పిచ్చివాడా, నగల వర్తకుడైనవాడు మాయబంగారాన్ని పొరపాటున అయినా నిజమైన బంగారమని పొరబడతాడా? అదీ గాక ఈ జయంతుడనే కుర్రవాడు మోసం చెయ్యదలిచిన వాడైతే బాకీ వడ్డీతోసహా తీర్చటానికి మళ్ళీ వస్తాడా? ఆ కుర్రవాడి



మోహం తనకు తెలీదని నగలవర్తకుడే అంటున్నాడు గద! నగలవర్తకుడు ఇలాటి మోసాలు ఇంకా చేసి ఉంటాడు. వాడి అంతు తేల్చాలి. అందుకు ఇలా చేద్దాం." అని రాజు ఒక ఉపాయం చెప్పాడు.

దాని ప్రకారం మంత్రి మర్నాడు తన నౌకరును ఒకణ్ణి పిలిచి, వాడికి ఒక రత్నాల కంకణం ఇచ్చి, ఏం చెయ్యాలో చెప్పి నగలవర్తకుడి వద్దకు పంపాడు.

వాడు నగలవర్తకుడి వద్దకు వెళ్ళి, "అయ్యా, నేను పరదేశిని. ఇక్కడ వర్తకం చేసుకుందామని ఈ నగరం వచ్చాను. నాదగ్గిర ఈ కంకణం తప్ప ఏమీలేదు. దీని వెల పదివేల వరహాలుంటుంది. తమరేమైనా కొంటారా?" అని అడిగాడు.

నగలవర్తకుడు ఒకసారి మనిషిని ఎగాదిగా చూసి, ఒకసారి కంకణాన్ని చూసి, అది దొంగసొమ్మయి ఉంటుందని గ్రహించి, "ఇది నువ్వు చెప్పినంత వెల చెయ్యదు. రెండువేల వరహాలకిస్తే కొంటాను," అన్నాడు.

"అన్యాయం! కనీసం అయిదువేలన్నా ఇవ్వండి." అన్నాడు మంత్రిమనిషి.

ఈ మాటతో అది దొంగసొమ్మని నగలవర్తకుడు రూఢి చేసుకున్నాడు. ఎందుచేతనంటే, ఆ కంకణం వెల ఎంత లేదన్నా పన్నెండువేల వరహాలు ఉంటుంది. అందుచేత వర్తకుడు, "కావలిస్తే, ఇంకో అయిదు వంద లిస్తాను. ఇష్టముంటే అమ్ము. లేదా దీన్ని నువే ఉంచుకో!" అన్నాడు.



"సరే, అలాగే ఇయ్యండి. ఏం చేస్తాం?" అని మంత్రిమనిషి సొమ్ము తీసుకుని చల్లగా జారుకున్నాడు.

నగలవర్తకుడు ఆ కంకణాన్ని తన నగలపెట్టెలో భద్రపరుస్తూ ఉండగా నగర రక్షకుడు రాజభటులతో సహా దుకాణంలోకి వచ్చి, "నమస్కారం, శ్రేష్ఠిగారూ! మీకు కొంచెం శ్రమ కలిగించ వచ్చాం," అన్నాడు.

"దాని కేం? తమరు ప్రభువులు! సెల విప్వండి," అన్నాడు నగలవర్తకుడు.

"మరేమీ లేదు. కిందటి రాత్రి రాజభవనంలో కొన్ని నగలు పోయాయి. దొంగ వాటిని మీ బోటి వారికి అమ్మి ఉంటాడని నగలవర్తకుల సరుకు పరీక్షిస్తున్నాం," అన్నాడు నగరరక్షకుడు.

"చూసుకోండి. ఇదే నా నగలపెట్టె!" అన్నాడు వర్తకుడు.

పెట్టె తెరవగానే పైనే కనిపించింది కంకణం!

"ఇది రాజుగారింట పోయిన నగే! ఈ పెట్టెను ఇలాగే రాజభవనానికి తీసుకుపోతాం. మీరు కూడా వెంట రండి," అన్నాడు నగరరక్షకుడు నగలవర్తకుడితో.

చేసేది లేక నగలవర్తకుడు తన పెట్టె వెంట రాజభవనానికి వెళ్ళాడు. అక్కడ నగరరక్షకుడు నగలవర్తకుణ్ణి ఒక గదిలో కూర్చోమని, వాకిలి వద్ద ఒక భటుణ్ణి కాపలా ఉంచాడు.

ఈ లోపల ఊరంతా చాటింపు వేశారు. "ఫలాని నగలవర్తకుడి వద్ద నగలు తాకట్టు పెట్టి తిరిగి తీసుకున్న వాళ్ళందరూ రాజభవనానికి ఆ నగలతో రావాలి," అన్న చాటింపు విని చాలామంది వచ్చారు.

వారిలో చాలామంది వద్ద ఉన్నవి నకిలీ నగలు. అసలు నగలు పెట్టెలో దొరికాయి. నగలవర్తకుడి మోసం పూర్తిగా రుజువయింది. ఆ పెట్టెలో జయంతుడి ముత్యాల హారం కూడా ఉన్నది.

రాజుగారు జయంతుడికీ, మిగిలిన వాళ్ళకూ వారివారి అసలు నగలు ఇప్పించి, మోసకారి అయిన నగలవర్తకుడికి కారాగృహవాస శిక్ష విధించాడు.





# అలీబాబా నలభైదొంగలు

## 3

మర్జీనా నేలమాళిగకు తిరిగి వచ్చి, శవానికి స్నానం చేయించి, ధూపంవేసి, వాసన నూనె పట్టించి, అలీబాబా సహాయంతో శవానికి పాడెగుడ్డచుట్టి, డోలీకొనుక్కు రావటానికి వెళ్ళింది.

శవాన్ని డోలీలోపెట్టి, దాని పైన మంద మైన దుప్పట్లు కప్పారు. మసీదు నుంచి ఇమామ్‌నూ, ఇతర పెద్దలనూ పిలిచారు. ఇరుగు పొరుగు వాళ్ళు నలుగురు శవాన్ని మోస్తుంటే, ముందుగా ఇమామూ, ఆయన వెనకగా కొరాను చదివేవాళ్ళూ, వాళ్ళ వెనక గుండెలు బాదుకుని ఏడుస్తూ మర్జీనా నడిచారు. శవం వెనక అలీబాబా, అతని మిత్రులూ నడిచారు. అలీబాబా భార్యా, వదినెగారూ, చూడ వచ్చిన ఆడవాళ్ళూ ఏడుస్తూ ఇంట్లోనే ఉండిపోయారు. ఈ విధంగా, ఎవరికీ ఎలాంటి అనుమానమూ కలగకుండా కాసిం ఉత్తర క్రియలు జరిగి పోయాయి.

ఒక నెల గడిచిన తరవాత నలభైమంది దొంగలు తమ గుహకు తిరిగి వచ్చారు. లోపల కాసింశవం ఖండాలు లేవు. దొంగల నాయకుడు దీర్ఘంగా ఆలోచించి, "అబ్బాయిలూ, మన రహస్యం బయటపడింది. మనం చంపినవాడికి ఎవడో అనుచరుడున్నాడు. వాణ్ణికూడా పట్టి చంపక పోయామో, ఎన్నో తరాలుగా మనవాళ్ళు సంపాదించి, మనం స్వయంగా పెంపొందించిన ఈ నిక్షేపం మనకు దక్కదు. అందుచేత ఇప్పుడు చేయవలసిన దేమంటే, మనలో సాహసీ, బుద్ధిశాలీ అయిన వాడొకడు సాధువు వేషం వేసుకుని, అరుముక్కలైన శవం గురించి ఆరాతీయాలి. మన రహస్యం బయట పడరాదు గనక ఇలా ఆరాతీయ



పోయినవాడు విఫలుడైతే వాడికి మరణ దండన విధిస్తాం," అన్నాడు.

తమ నాయకుడు ఇలా బెదురుపెట్టినప్పటికీ, ఒక దొంగ ఆరాతీయటానికి వెళతానని ముందుకు వచ్చాడు. వాణ్ణి మిగిలిన వాళ్ళు అభినందించి పంపారు.

వాడు ఒక ఉదయం పెందలాడే నగరంలోకి వచ్చాడు. ఇంకా దుకాణాలేవీ తెరవ లేదు గాని, ముస్తఫా మాత్రం తన ఇంటి ముందు భాగంలో కూర్చుని ఆరెతో పాద రక్షలు తయారు చేస్తున్నాడు. అతను తల ఎత్తేసరికి, తన కేసే చూస్తూ ఎవరో సాధువు కనిపించాడు. ముస్తఫా సాధువును పలకరించాడు.

"ఇంత వయసులో కూడా నీ కంటి చూపు చెదరక పోవటమూ, చెయ్యి వణకక పోవటమూ ఎంత ఆశ్చర్యం!" అన్నాడు దొంగసాధువు.

"అల్లా కటాక్షం, సాధువుగారూ. ఇప్పటికీ తడువుకోకుండా సూదిలో దారం ఎక్కించ గలను. కటిక చీకటిలో ఆరుముక్కల శవాన్ని కలిపి కుట్టగలను!" అన్నాడు చెప్పులు కుట్టేవాడు.

దొంగవాడు ఆనందంతో మూర్ఛపోయినంత పని చేసి, తన పని ఇంత తేలికగా అవుతున్నందుకు ధన్యవాదాలు చెప్పుకున్నాడు. అతను పైకి ఆశ్చర్యం నటిస్తూ, "శవం ఆరుఖండాలేమిటి? శవాన్ని ఆరు ముక్కలుగా నరికి, మళ్ళీ కుట్టటం ఈ దేశపు ఆచారమా? ఎందుకు చేస్తారలా? లోపల ఏమున్నదో చూడటానికా?" అని అడిగాడు.

ముస్తఫా నవ్వి, "అలాటి ఆచార మేమీ లేదు. నాకు తెలిసిన దేదో తెలుసు. దాన్ని ఇతరు లెవరూ తెలుసుకోరాదు. అది నేను చెప్పగూడని విషయం. అదీగాక ఉదయం పూట నాకు జ్ఞాపక శక్తి అంతగా ఉండదు," అన్నాడు.

దొంగసాధువు విరగబడి నవ్వుతూ, "భలేవాడివే! నాకు ఒకరి రహస్యాలు కావాలనుకున్నావా ఏమిటి? కాని, ఎవడో

క్రొత్తవాడు ఇలా అడుగుతా డేమని అనుకోక పోతే, నువు శవాన్ని కుట్టిన ఇల్లు చూప గలవా?" అంటూ చెప్పులు కుట్టేవాడి చేతిలో ఒక బంగారు దీనారం రహస్యంగా ఉంచాడు.

"నా కెలా తెలుస్తుంది, సాధువుగారూ? ఎవరో ఒక పిల్ల నా కళ్ళకు గంతలు కట్టి తీసుకుపోయింది. కాని, ఒకటి చేస్తే నాకా ఇల్లు తెలుస్తుందేమో. నా కళ్ళకు గంతలు కట్టి తీసుకుపోతే స్పర్శను బట్టి నాకు కొన్ని కొండగుర్తులు తెలియవచ్చు." అన్నాడు ముస్తఫా.

"అలా చెప్పవేం? ఇంక కావలసిం దేమిటి?" అన్నాడు దొంగసాధువు.

ఈ మెప్పుతో ముసలివాడు కరిగిపోయి, తన కళ్ళకు గంతలు కట్టించుకుని, దారి తడువుకుంటూ దొంగను అలీబాబా ఇంటి దాకా తీసుకుపోయి, "సందేహం లేదు, ఇదే ఇల్లు. ఈ గాడిదల వాసన నాకు గుర్తే. ఈ గుంజకు నాకు ఎదురుదెబ్బ తగిలింది కూడాను!" అన్నాడు.

దొంగ పరమానందభరితుడై, చెప్పులు కుట్టేవాడి కళ్ళ గంతలు విప్పి, అతని చేతిలో మరో బంగారు దీనారం పెట్టి, అలీ బాబా తలవాకిలి తలుపు మీద సుద్దముక్కతో గుర్తు పెట్టాడు. తరవాత చెప్పులు కుట్టేవాడు తన దుకాణానికీ, దొంగ అరణ్యంలో ఉన్న తన అనుచరుల వద్దకూ తిరిగి వెళ్ళిపోయారు.

ఇది జరిగిన కొద్దిసేపటికే మర్జీనా కిరాణా దుకాణానికి బయలుదేరుతూ తలుపు మీద గుర్తు చూసి, "ఇది తనంతట తాను గీసు





కున్న గుర్తు కాదు, ఎవడో శత్రువు గీసినది. దీని కేదైనా విరుగుడు చూడాలి," అనుకున్నది. ఆమె ఒక సుద్దముక్క తెచ్చి, వీధిలో ఉండే అన్ని తలుపుల మీదా అదే గుర్తు గీస్తూ, "నీ కంట్లో నా వేలు! నీ కంట్లో నా వేలు!" అనుకున్నది. అలా అనుకుంటే తంత్రాలు పారవుట!

మర్నాడు ఉదయం దొంగలు జంటలు జంటలుగా నగరంలోకి వచ్చి, తమ గూఢచారి గుర్తుపెట్టిన ఇంటి కోసం వెతుకుతూ, వీధి పొడుగునా ప్రతి ఇంటికీ గుర్తు ఉండటం చూసి నిర్ఘాంతపోయారు. వీధిలో తచ్చాడుతుంటే పదిమందీ అనుమానిస్తారని, దొంగలందరినీ వాళ్ళ నాయకుడు అరణ్యానికి పంపేశాడు. అక్కడ దొంగల గూఢచారి విచారణ జరిగింది. అతనికి మరణదండన విధించి అప్పటికప్పుడే తల నరికేశారు.

తమ రహస్యాన్ని తెలుసుకున్నవాడి మీద దొంగలకు నూరింతలు పగ పుట్టుకొచ్చింది. మళ్ళీ ఒక దొంగ తమ శత్రువును కనుక్కునేటందుకు బయలుదేరాడు. వాడు కూడా చెప్పులు కుట్టేవాడి సహాయంతో అలీబాబా ఇల్లు తెలుసుకుని, ఎవరూ గమనించనిచోట ఒక ఎర్రగుర్తు పెట్టి, గుహకు తిరిగి వచ్చాడు. అయితే మర్జీనా దాన్ని గమనించి, ఆ పేటలో ఉన్న తలుపు లన్నిటి మీదా అలాటి ఎర్ర గుర్తులే పెట్టింది. అందుచేత దొంగలు జంటలు జంటలుగా నగరంలోకి వచ్చి, తమకు కావలసిన ఇంటిని గుర్తించలేక, అరణ్యానికి తిరిగి వెళ్ళి తమ రెండో గూఢచారి తల కూడా నరికేశారు.

"నేను స్వయంగా వెళితేగాని పని జరగదు," అనుకుని దొంగలనాయకుడు ముసలివాడి సహాయంతో అలీబాబా ఇల్లు తెలుసుకుని, దాని మీద గుర్తు లేవీ పెట్టక, ఇంటిని చాలాసేపు పరీక్షగా చూసి వెళ్ళిపోయాడు. అతను మిగిలిన ముప్పైఏడుగురు దొంగలనూ కలుసుకుని, "నాకు ఇల్లు ఇప్పుడు బాగా గుర్తున్నది. ఆ ఇంటిని ఏంచెయ్యాలో అది చేద్దాం. మీరు వెళ్ళి, మూతులు వెడల్పుగా ఉండే ముప్పైఎనిమిది పెద్ద



బానలను తీసుకురండి. వాటిలో-ఒకదానిలో మాత్రం నూనె నింపి, మిగిలినవి ఖాళీగా ఉంచండి," అన్నాడు.

దొంగలు మారుమాటాడకుండా బానలమ్మే బజారుకు వెళ్ళి, బానలను తెచ్చారు. వాళ్ళ నాయకుడు ఆజ్ఞాపించిన మీదట, ముప్పైఏడుగురు దొంగలూ ముప్పైఏడు బానలలో దూరి కూర్చున్నారు. నాయకుడు వారికి ఒక్కొక్క కత్తీ, ఒక్కొక్క దుడ్డు కర్రా ఇచ్చాడు. అన్ని బానల వెలపలా నూనెమరకలు పెట్టారు. అన్ని బానల మూతులకూ నారపీచు పెట్టి, ఒక్కొక్క గుర్రం మీద రెండేసి బానలు అటూ ఇటూ కట్టి, దొంగలనాయకుడు ఆ గుర్రాలను తోలుకుంటూ నగరానికి బయలుదేరాడు.

అతను చీకటిపడే వేళకు అలీబాబా ఇల్లు చేరాడు. అలీబాబా చల్లగాలి కోసం తల వాకిటనే నిలిచి ఉన్నాడు.

దొంగలనాయకుడు గుర్రాలను నిలిపి, అమిత మర్యాదగా అలీబాబాతో, "యజమానీ, తమ గులాము నూనెవర్తకుడు. వాడికి ఊరు కొత్త. ఈ రాత్రికి ఎక్కడ నిలవాలో తెలియదు. తమ ఇంటి ముందున్న ఆవరణలో వాణ్ణీ, గుర్రాలనూ తలదాచుకోనివ్వగలరా?" అన్నాడు.

అలీబాబా తన పేదరికాన్ని మరవలేదు. అతను దొంగలనాయకుడితో, "అన్నా, నూనె వర్తకుడా! తప్పక నా ఇంటికి దయచేసి, విశ్రాంతి అనుభవించు," అని చెయ్యి పట్టుకుని తన ఆవరణలోకి తీసుకుపోయి, మర్జీనానూ, మరో బానిసనూ పిలిచి, "బానలను దించటానికి సహాయం చెయ్యండి, గుర్రాలకు దాణా వెయ్యండి," అన్నాడు.

బానలన్నిటినీ ఆవరణ వెనక భాగంలో అమర్చి, గుర్రాలను గోడ వారగా కట్టేసి, వాటికి బార్లీ మొదలైన దాణా వేశారు. అలీబాబా దొంగల నాయకుణ్ణి ఏ మాత్రమూ గుర్తించక, లోపలికి తీసుకుపోయి గౌరవ స్థానంలో కూర్చొబెట్టి, తాను పక్కనే కూర్చుని, భోజనం చేయించాడు. తరవాత తన అతిథితో, "ఈ ఇల్లు మీ ఇల్లే అను

కోండి!" అని చెప్పి అలీబాబా వెళ్ళి పడుకున్నాడు.

దొంగలనాయకుడు శంక తీర్చుకునే మిష మీద దొడ్లోకి వెళ్ళి, ఒక్కొక్క బాన దగ్గిరే ఆగి, "నేను రాయి వేసినప్పుడు వెంటనే లేచి నా దగ్గిరికిరా. ఈ రాత్రి తలలు తెగి పోవాలి!" అని రహస్యంగా చెప్పి మళ్ళీ లోపలికి వచ్చేశాడు. మర్జీనా దీపంతో వచ్చి అతన్ని పడుకునే చోటికి తీసుకుపోయింది. దొంగలనాయకుడు వెంటనే పడుకుని, గుర్రుపెట్టుతూ నిద్రపోయాడు.

తరవాత మర్జీనా కంచాలూ, గిన్నెలూ కడుగుతూండగా దీపంలో చమురు అయి పోయింది. ఆ రోజు ఆమె నూనె కొనుక్కుని రావలిసిన సంగతి మరిచిపోయింది. ఆమె అబ్దల్లా అనే బానిసను పిలిచి, "ఒరే, ఇంట్లో నూనె లేదు, ఎలా?" అన్నది.

అబ్దల్లా నవ్వి, "దొడ్లో ముప్పై ఎనిమిది బానల నూనె, ఒకటోరకంది ఉంటే, ఇంట్లో నూనె లేదంటావేం? మళ్ళీ మహా తెలివి గల దాన్నంటావే!" అని వేళాకోళం చేశాడు.

మర్జీనా ఒక లోటా తీసుకుని దొడ్లోకి వెళ్ళి, ఒక బాన మీది నారపీచు చుట్ట ఎత్తి, లోటా ముంచింది. కాని నూనె తగలటానికి బదులు గట్టి పదార్థం ఏదో తగిలింది. లోపల ఉన్నవాడు, "వేళ అయిందిగామాలు!"- అంటూ పైకి లేచాడు.

అతని తల భయంకరమైన గడ్డంతో సహా బానలో నుంచి పైకి రావటం చూసి మరొకతె అయితే కెవ్వున అరిచి ఉండేదే. ఎంతో నిగ్రహం గల మర్జీనా కూడా ఆ తల చూడ గానే తనలో, "చచ్చాను!" అనుకున్నది. కాని మరుక్షణం ఆమె తెప్పరిల్లి, "అప్పుడే కాదు! మీ యజమాని ఇంకా నిద్ర పోతున్నాడు. కొంచెం ఆగు," అన్నది.

ఆమె ప్రతి బాన దగ్గిరికి వెళ్ళి, పైకిలేచిన ప్రతి తలతోనూ, ఇంకా సమయం రాలేదని చెప్పి, బానల్లో ఉన్న 37 మందినీ ఎంచి, మిగిలిన బానలో నుంచి నూనె తీసుకుని ఇంట్లోకి తిరిగి వచ్చి, దీపం వెలిగించి, అపాయాన్ని తొలగించే ఉపాయం ఆలోచించింది.

—[ముగింపు వచ్చే సంచికలో.]





# నిజమైనజోస్యం

ఒక గ్రామంలో ఒక జ్యోతిష్కు డుండేవాడు. అతనికి ప్రపంచంలో నా అనేవారు ఎవరూ లేరు. అందు చేత అతను ఆ గ్రామంలో ఉండే అమాయకులకు జోస్యం చెప్పి, పెళ్ళిళ్ళకూ, గృహప్రవేశాలకూ, పడుగులకూ, ముహూర్తాలు పెట్టి, వర్జ్యం వగైరాలు చెప్పి తన ఒంటి పొట్టను ఎలాగో పోషించుకుంటూ వస్తున్నాడు. నిజానికి అతనికి జ్యోతిషం అంతగా రాదు. కాని అతను చెప్పేవి ఎప్పుడన్నా దారితప్పి నిజమవుతూ ఉండటం చేత గ్రామంలో చాలామందికి అతని మాట యందు విశ్వాసం ఉండేది.

ఒక రోజు ఉదయం సోమశాస్త్రి అనే బ్రాహ్మడు జ్యోతిష్కుడికి ఎదురుపడి, "ఇవాళ నా యోగం ఎలా ఉన్నది?" అని అడిగాడు.

జ్యోతిష్కుడికి ఏమి చెప్పటానికీ పాలుపోక, "కొంచెం జాగ్రతగా ఉండండి. ఇతరులు చెప్పే మాటలు వింటే నష్టం కలగవచ్చు." అన్నాడు.

ఆ మాట మనస్సులో ఉంచుకుని శాస్త్రి ఇంటికి తిరిగి వచ్చాడు.

అదే సమయంలో రామశాస్త్రి అనే మరో బ్రాహ్మడు సోమశాస్త్రి వద్దకు వచ్చి, "బయలుదేరవయ్యా! పక్క గ్రామంలో సంతర్పణా దానమూ జరుగుతున్నది. త్వరగాపోదాం," అని తొందర చేశాడు.

ఇతరులు చెప్పే మాటలు వింటే నష్టం కలుగుతుందని జ్యోతిష్కుడు చెప్పిన మాట సోమశాస్త్రికి గుర్తువచ్చింది. ఆ రోజు ఉన్న ఊళ్ళో కరణంగారింట వ్రతం జరుగుతున్నది. రామశాస్త్రి చెప్పే సంతర్పణా సంభావనలను గురించి ఎవరూ అసగా సోమశాస్త్రి వినలేదు.

అందు చేత సోమశాస్త్రి రామశాస్త్రితో, "నేనివాళ రాలేనులే," అన్నాడు.

పొర్నంది మోహన్

రామశాస్త్రి ఒక్కడే పొరుగూరికి పరుగు పరుగున వెళ్ళాడు. సోమశాస్త్రి కరణంగా రింటికి వెళ్ళి వ్రతం చేయించి, వారిచ్చిన రెండణాల దక్షిణా పుచ్చుకొని ఇంటికి తిరిగి వచ్చాడు.

ఆ సాయంకాలానికి రామశాస్త్రి పొరుగూరి నుంచి తిరిగి వచ్చి, "షావుకారుగారింట బ్రహ్మాండంగా విందు జరిగింది. బ్రాహ్మలం దరికీ తలా ఒక రూపాయీ ఇచ్చి, బట్టలు పెట్టారు," అన్నాడు.

సోమశాస్త్రి గుండెలో రాయి పడ్డట్టయింది. తను కూడా రామశాస్త్రి వెంట వెళ్ళి ఉంటే తనకు కూడా దానమూ, బట్టలూ ముట్టేవి. జ్యోతిష్కుడు తనను ముంచాడు.

ఆ కోపంతో సోమశాస్త్రి గ్రామమునసబు గారింటికి వెళ్ళి, "అయ్యా, మీరు మన ఊళ్ళో ఉండే జ్యోతిష్కుణ్ణి తక్షణం ఊళ్ళోనుంచి వెళ్ళగొట్టండి. అతను చెప్పే జోస్యం అంతా శుద్ధ అబద్ధం. అతని మాటలు నమ్మి నేను ఎంతో నష్టపోయాను," అంటూ తనకు జరిగిన నష్టం తెలిపాడు.

గ్రామమునసబు జ్యోతిష్కుణ్ణి పిలి పించి, "తెలిసీ తెలీని జోస్యం ఎందుకు చెప్పావు? నీ మాటనమ్మి ఈ బ్రాహ్మడు చాలా నష్టపడ్డాడట గదా?" అన్నాడు.

జ్యోతిష్కుడు క్షణంపాటు భయపడ్డాడు, కాని తాను అన్న మాటలు గుర్తుతెచ్చుకుని ధైర్యంగా, "నేనేమీ అబద్ధం చెప్పలేదు, మునసబుగారూ. ఇతరులు చెప్పే మాటలు వింటే నష్టం కలగవచ్చునన్నాను. ఇవాళ ఆ బ్రాహ్మడికున్న యోగం అదే. అదే జరిగింది కూడానూ," అన్నాడు.

"నీ మాట విని, రామశాస్త్రి చెప్పినది నమ్మక ఈ సోమశాస్త్రి ఆయన వెంట వెళ్ళటం మానుకున్నాడు. నీ మాట నిజం ఎలా అయింది?" అన్నాడు మునసబు.

"ఇతరుల మాటలంటే రామశాస్త్రి మాట లేనుటండీ? నేను చెప్పినవి మాత్రం ఇతరులు చెప్పిన మాటల కిందికిరావూ? యోగం ఎవరు తప్పించగలరండీ?" అన్నాడు జ్యోతిష్కుడు. సోమశాస్త్రి తెల్ల మొహం వేసి, ఇంటికి తిరిగి వెళ్ళిపోయాడు.





# గొప్పయింటి విందు

ఒక గ్రామంలో ఒక జమీందారు ఉండేవాడు. ఆయన గొప్ప ధనికుడూ, అంతకన్న గొప్ప అహంకారీనూ. ఆ గ్రామంలో పెద్ద కుటుంబాలు అనేవి చాలా కొద్దిగా ఉండేవి. మిగతా ప్రజలందరూ రైతులూ, కాపులూనూ. జమీందారుకు వాళ్ళ పొడ ఏమాత్రమూ గిట్టేది కాదు. వాళ్ళ గాలి సోకితే ఆయన చిరాకుపడి, "మట్టి వెధవలు!" అని తిట్టుకునేవాడు. ఆయనకు నూరు అంగల దూరంలో నిలబడటానికి ఎవరూ సాహసించేవారు కారు.

ఒక రోజు పొలాల్లో రైతులు, "ఇవాళ నేను జమీందారుగారిని అంత దూరంలో చూశాను, ఇంత దూరంలో చూశాను," అని గొప్పగా చెప్పుకుంటూంటే, ఒక పేద కాపు విరగబడి నవ్వి, "ఏ చెట్టు చాటు నుంచో, పుట్ట చాటు నుంచో జమీందారుగారిని చూడటం ఒక గొప్పా ఏమిటి? తలుచుకుంటే నేను జమీందారుగారింట విందు భోజనం తినగలను," అన్నాడు.

ఈ మాటలు విని మిగిలిన రైతులకు చాలా కోపం వచ్చింది.

"ఈ మొహమేనా జమీందారుగారింట విందు కుడిచేది? నిన్ను జమీందారుగారి గేటు దాటి లోపలికి అడుగు పెట్టనివ్వరు. ఎత్తి మురుగుగుంటలో వేస్తారు. ప్రగల్భాలాడకు," అంటూ నలుగురూ నాలుగు మాటలూ అన్నారు.

"ప్రగల్భాలాడే దాకా నా కేం పని? ఉన్న మాటే చెబుతున్నాను. నేను తలుచుకుంటే ఏ పూటైనా జమీందారుగారింటికి వెళ్ళి, భోజనం చేసి రాగలను," అన్నాడు పేదకాపు.

"నువు ఆ పని చేస్తే నీకు మూడు గరిసెల ధాన్యమూ, జత ఎద్దులూ ఇస్తాం. నువు జమీందారుగారింట భోజనం చెయ్య

ఆర్. కుమారస్వామి

లేకపోతే మేం చెప్పిన పనిఅల్లాచెయ్యాలి," అన్నారు రైతులు.

"నా కేమీ అభ్యంతరం లేదు," అన్నాడు పేదకాపు.

ఆ పూట వాడు జమీందారుగారింటికి వెళ్ళాడు. తలవాకిట కావలివాళ్ళు వాణ్ణి తరిమి కొట్టబోయారు.

"కొంచెం ఆగండి. నేను ప్రభువువారి కొక శుభవార్త చెప్పాలి," అన్నాడు కాపు.

"ఆ శుభవార్త ఏమిటో మాతో చెప్పు. మేం ఏలిన వారితో చెబుతాం," అన్నారు కావలావాళ్ళు.

"ఈ శుభవార్త ప్రభువుగారితో స్వయంగా చెప్పాలి. అది మీతో చెప్పేది కాదు," అన్నాడు కాపు.

జమీందారుతో నౌకర్లు కాపువాడన్న మాట చెప్పారు. వాడు తనతో చెబుతానన్న శుభ వార్త ఏమిటో తెలుసుకోవాలని జమీందారుకు కుతూహలం కలిగింది. ఈ కాపువాడు ఏదో లాభకరమైన సంగతి చెప్పటానికి వచ్చాడు గాని, అందరి లాగా యాచనకు రాలేదు. అందుచేత ఆయన వాణ్ణి లోపలికి రానిమ్మని తన నౌకర్లతో చెప్పాడు.

నౌకర్లు కాపును తెచ్చి జమీంధారు ముందు ఉంచారు.

"నువు యీ ప్రాంతాల వాడివిలాగే వున్నావు! ఏమిటి నువు చెప్పదలచిన వార్త?" అని జమీందారు కాపును అడిగాడు.

"తమతో ఏకాంతంగా చెబుతాను," అన్నాడు కాపు.



జమీందారు కుతూహలం మరింత అయింది. ఆయన తన నౌకర్లను అవతలికి పంపేశాడు.

కాపువాడు రహస్యంగా, "గుర్రం తలకాయంత బంగారం ధర ఏపాటి ఉంటుందంటారు?" అని జమీందారును అడిగాడు.

"ఎందుకలా అడుగుతున్నావు?" అన్నాడు జమీందారు.

"ఒక కారణం ఉండి అడుగుతున్నాను, ప్రభూ. తమకు తెలిస్తే చెప్పండి," అన్నాడు పేదకాపు.

"ఆ కారణం చెప్పమంటున్నాను," అన్నాడు జమీందారు.

కాపువాడు నిట్టూర్చి, "తమకు చెప్పడం ఇష్టం లేకపోతే నేను మాత్రం ఏం చెయ్యగలను? తమ సెలవైతే ఇంటికి పోయి భోజనం చేస్తాను. కడుపులో మండిపోతున్నది," అన్నాడు.

జమీందారుకు వాడిని వెళ్ళనివ్వ బుద్ధి కాలేదు. గుర్రం తలకాయంత బంగారం చెయిజారి పోనివ్వటం ఇష్టంలేక ఆయన తన నౌకర్లను పిలిచి, "వీణ్ణి తీసుకుపోయి, వెంటనే పుష్టుగా భోజనం పెట్టండి," అన్నాడు.

కాపువాడు రాజోపచారంగా కడుపునిండా తిండి తిని వచ్చాక, జమీందారు వాడితో, "నువు ఆ బంగార మేదో పట్టుకురా! దాని గొడవ నీ కన్న నాకు బాగా తెలును. నీకు బహుమానం కూడా ఉంటుందిలే!" అన్నాడు.

"బంగారమా? నా దగ్గిర బంగారం ఎక్కడున్నది? రెండు గరిసెల ధాన్యమూ, జత ఎద్దులూ కలిసి గుర్రం తలకాయంత బంగారంతో సమానం అవునో కాదో తమని నడిగితే తెలుస్తుంది గదా అనుకున్నాను," అన్నాడు కాపు.

జమీందారుకు మండిపోయింది. "ఛీ, వెధవా! ఇంకో క్షణం ఇక్కడున్నావంటే నిన్ను చంపేస్తాను. పూరు మాట్లాడకుండా పో!" అన్నాడు కాపుతో.

కాపు వెళ్ళిపోయి, రైతుల దగ్గిర పందెం గెలుచుకున్నాడు.



# అందరివల్లా కాదు

పొలాల్లో నూర్పిళ్ళు జరిగే తరుణంలో ఇద్దరు యోగులు ఒక గ్రామం చేరి, పొద్దుగూకేవేళ ఊరిషావుకారు యింటికి వెళ్ళి, "అయ్యా, ఈ రాత్రికి మాకు భోజనంపెట్టి, మీ యింట పడుకోనివ్వండి," అని అడిగారు.

"నేను సోమరిపోతులకు దానధర్మాలు చేసేవాణ్ణికాను. ఈ పూట మీకు తిండిపెట్టి, రాత్రికి పడుకోనిస్తాను. కాని మీరు చీకటితోనే లేచి, మా పొలంలో వేసిన కుప్పల్లో ఒకటి నూర్చి మరీ వెళ్ళాలి," అన్నాడు షావుకారు.

"దానికేం భాగ్యం? ఒక కుప్ప మాకు వదిలెయ్యండి," అన్నారు యోగులు.

కాని తెల్లగా తెల్లారివాక కూడా వాళ్ళు నిద్ర లేవలేదు. షావుకారు వచ్చి వాళ్ళను లేవగొట్టి, "మీ వాలకం చూస్తే పనికి మొండివాళ్ళుగా ఉన్నారే? లేవండి," అన్నాడు.

"కుప్ప నూర్చుట మనగా ఎంత?" అంటూ వాళ్ళు ఒక కొరివి తీసుకుని పొలానికి వెళ్ళి షావుకారు లబలబలాడుతున్నా వినకుండా, కుప్ప నాలుగు వైపులా మంటపెట్టారు. క్షణంలో కుప్పంతా అంటుకుని అంతలోనే మంటలు చల్లారాయి. తరవాత చూస్తే ధాన్యమూ, గడ్డీ వేరయి కనిపించాయి. యోగులు వెళ్ళిపోయారు.

"ఇదా రహస్యం?" అనుకుని షావుకారు ఆ కొరివితోనే మిగిలిన కుప్పలన్నీ అంటించాడు. ధాన్యమూ, గడ్డీ మొత్తంగా తగలబడి బూడిద అయిపోయాయి.





# తెలివిగలవాళ్ళు

ఒక పేదవాడికి ముగ్గురు కొడుకులుండే వారు. పేదవాడు తన కొడుకులతో, "నాయనలారా, మనకు మాన్యాలులేవు. మందలు లేవు. అందుచేత మీరు తెలివితేటలు సంపాదించుకోండి. సూక్ష్మబుద్ధిగలవాళ్ళు ఏదో విధంగా బతక లేకపోరు; ఎక్కడైనా బతక గలరు," అనేవాడు.

తండ్రి చేసిన బోధలతో ఆ అన్నదమ్ములు ముగ్గురూ మంచి కుశాగ్రబుద్ధులుగా తయారయారు. కొంత కాలానికి తండ్రి చనిపోయాడు. తరవాత కొడుకులు దేశాటన చేద్దామనీ, తమ తెలివితేటలు రాణించే చోట బతుకు తెరువు చూసుకుందామనీ నిశ్చయించి, తమ గ్రామంనుంచి బయలుదేరారు.

వాళ్ళు చాలా రోజులు ప్రయాణించి, అలసిపోయి, చివరకు ఒక నగరాన్ని చేరవచ్చారు. వాళ్ళకు ప్రాణం లేచివచ్చినట్టయింది. ముగ్గురూ నగరంకేసి నడుస్తూండగా పెద్దవాడు చప్పున ఆగి, నేలకేసి చూసి, "కొద్దిసేపటి కింద ఇటుగా ఒక పెద్ద ఒంటె వెళ్ళింది," అన్నాడు.

రెండోవాడు బాటకు అటూ ఇటూ చూసి, "దానికి ఒక కన్ను గుడ్డి," అన్నాడు.

వాళ్ళు మరికొంత దూరం నడిచాక మూడోవాడు, "ఆ ఒంటె మీద ఒక ఆడదీ, ఒక బిడ్డా ఉన్నారు," అన్నాడు. మిగిలిన ఇద్దరూ నిజమేనన్నారు.

ముగ్గురూ ముందుకు నడిచిపోతూండగా ఒక మనిషి గుర్రంమీద అటుగా వచ్చాడు. పెద్దవాడు ఆ మనిషి కేసి చూసి, "దేని కోసమో వెతుకుతున్నట్టున్నావే?" అన్నాడు.

"అవును," అన్నాడు గుర్రంమీది వాడు.

"ఒంటె కోసం కాదుగద?" అన్నాడు పెద్దవాడు.

వి. సూర్యనారాయణ



"అవును," అన్నాడు గుర్రంమీది వాడు.

"పెద్ద ఒంటె కాదూ?" అన్నాడు పెద్దవాడు.

"అవును," అన్నాడు గుర్రంమీది వాడు.

"దాని ఎడమ కన్ను గుడ్డి, అవునా?" అని రెండోవాడు అడిగాడు.

"అవును," అన్నాడు గుర్రంమీది వాడు.

"దానిమీద ఒక ఆడదీ, బిడ్డా ఎక్కారు, కాదూ?" అన్నాడు మూడోవాడు.

గుర్రంమీది వాడు అన్నదమ్ముల కేసి అనుమానంగా చూసి, "నా ఒంటెను మీరు సంగ్రహించారన్నమాట! దాన్ని ఏం చేశారో చెప్పండి. ఎవరికైనా అమ్మారా? లేక ఎక్కడైనా దాచారా?" అన్నాడు.

"నీ ఒంటెను మేము కళ్ళ చూడను కూడా లేదు," అన్నారు అన్నదమ్ములు.

"అయితే మీకు దానివైనాలన్నీ ఎలా తెలిశాయి?" అన్నాడు గుర్రంమీది వాడు.

"కళ్ళూ, బుద్ధీ ఉపయోగిస్తే చాలా విషయాలు తెలుస్తాయి. ఈ దిక్కుగా వెళ్ళావంటే నీ ఒంటె కనిపిస్తుంది," అన్నారు అన్నదమ్ములు.

"నేను ఏ దిక్కుగానూ వెళ్ళను. మీరే నా ఒంటెను కాజేశారు. దాన్ని నా కిచ్చెయ్యండి," అన్నాడు గుర్రంమీది వాడు.

"నీ ఒంటెను మేము చూడను కూడా లేదు బాబో అంటుంటే!" అన్నారు అన్నదమ్ములు.

గుర్రంమీది వాడు కత్తిదూసి ఆ ముగ్గురినీ బెదిరిస్తూ, ఆ నగరాన్ని ఏలే పాదుషా దగ్గిరికి తీసుకుపోయి, పాదుషా దగ్గిర ఇలా ఫిర్యాదు చేశాడు:

"నేను నా మందను కొండలకు తోలుకు పోతున్నాను. నా భార్యా, కొడుకూ ఒక ఒంటె మీద నాతో బయలుదేరారు. ఏ కారణం చేతనో వాళ్ళు వెనకపడి, దారి తప్పారు. నేను వాళ్ళను వెతుక్కుంటూ వెనక్కు వచ్చేసరికి ఈ ముగ్గురూ కాలినడకన వస్తూ కనిపించారు. వీళ్ళు నా ఒంటెను దొంగిలించారు; నా భార్యనూ, కొడుకునూ చంపేశారని నా అనుమానం."

"నీ అనుమానానికి ఆధారం ఏమిటి?" అని పాదుషా అడిగాడు.

"నేను పల్లెత్తుమాట అనకుండానే వీళ్ళు, నా ఒంటె పెద్దదనీ, దానికి ఒక కన్ను లేదనీ, దానిమీద ఒక అడదీ, బిడ్డా ఉన్నారనీ చెప్పారు." అన్నాడు ఒంటెవాడు.

"ఇక సందేహ మెందుకూ? వీళ్ళు దొంగలే." అని, పాదుషా అన్నదమ్ముల కేసి తిరిగి, "చోరులారా, ఒంటెను ఏమి చేశారో చెప్పండి." అన్నాడు.

"మేము చోరులం కాము. మేము ఇతడి ఒంటెను ఎన్నడూ చూడనైనా లేదు." అన్నారు అన్నదమ్ములు.

"మీ అంతట మీరే ఆ ఒంటెను పూస గుచ్చినట్టు వర్ణించి, ఆడదీ, బిడ్డా వున్న సంగతి కూడా చెప్పి, దొంగలం కామంటా రేమిటి?" అన్నాడు పాదుషా.

"అదేమీ విడ్డూరం కాదు, పాదుషా గారూ. చిన్నతనం నుంచీ మేము మా కళ్ళను చక్కగా ఉపయోగించటమూ, చూసినదానిని బట్టి అనేక విషయాలు తెలుసుకోవటమూ అభ్యాసం చేశాం." అన్నారు అన్నదమ్ములు.

పాదుషా హేళనగా నవ్వి, "ఎన్నడూ చూడని దాన్నిగురించి అంత వివరంగా తెలుసుకోవటం సాధ్యమా?" అన్నాడు.

సాధ్యమే నన్నారు అన్నదమ్ములు.

"అయితే మీ శక్తికి ఇప్పుడే పరీక్ష పెడతాను," అంటూ పాదుషా తన మంత్రిని దగ్గిరికి పిలిచి, అతనితో రహస్యంగా ఏదో





చెప్పాడు. మంత్రి అవతలికి వెళ్ళి, కొద్ది సేపట్లో తిరిగి వచ్చాడు. ఆయన వెనకగా ఇద్దరు నౌకర్లు ఒక పెట్టె పట్టుకుని వచ్చి, పాదుషా సమక్షంలో దాన్నిదించి, వెనక్కు తప్పుకున్నారు.

"చోరులారా, చెప్పండి! ఈ పెట్టెలో ఏ మున్నది?" అన్నాడు పాదుషా అన్నదమ్ములతో.

పెద్దవాడు, "మేము చోరులం కామని ముందే తమతో మనవి చేసుకున్నాం. తమరు అడిగారు కనక చెబుతాను—ఈ పెట్టెలో ఉన్నది ఒక గుండ్రని వస్తువు," అన్నాడు.

"అది దానిమ్మకాయ," అన్నాడు రెండోవాడు.

"అవును. ఇంకా పండలేదు," అన్నాడు మూడోవాడు.

ముగ్గురూ ఇలా అన్నతరవాత పాదుషా పెట్టెను తెరిపించి, అందులో ఉండే వస్తువును పైకి తీయించాడు. అది నిజంగానే పచ్చిదానిమ్మకాయ. దాన్ని చూసి సభలో ఉన్నవాళ్ళంతా అమితంగా ఆశ్చర్యపడ్డారు.

పాదుషా ఒంటె పోగొట్టుకున్న వాడితో, "వీళ్ళు దొంగలు కారు, అద్భుతమైన తెలివి తేటలుగల వాళ్ళు. నువు వెళ్ళి నీ ఒంటె కోసం వెతుక్కో," అన్నాడు.

తరవాత పాదుషా అన్నదమ్ములకు ముగ్గురికీ ఫలహారాలు తెప్పించి, అతిథి సత్కారాలు చేసి, "మీ మీద ఏ ఆరోపణా లేదు. మీ కిప్పుడేమీ నిర్బంధం లేదు. కాని ఆ ఒంటె గురించి ఎలా తెలుసుకున్నారో చెప్పండి," అని అడిగాడు.

దానికి పెద్దవాడు, "మేము వస్తున్న దారిలో ఒంటెకాళ్ళ గుర్తులు చూశాను. అవి చాలా పెద్దవి. అందు చేత ఆ ఒంటె చాలా పెద్దదని గ్రహించాను. తరవాత ఈ మనిషి అన్ని వైపులా చూసుకుంటూ వస్తూంటే, ఆ ఒంటె కోసమే వెతుకుతున్నాడని తోచింది," అన్నాడు.

"అంతవరకు సబబుగానే ఉన్నది. కాని దాని కన్ను ఒకటి గుడ్డి అని ఎలా తెలిసింది?" అని పాదుషా అడిగాడు.

అప్పుడు రెండోవాడు, "ఆ ఒంటె బాటకు కుడివైపున ఉన్న గడ్డిమాత్రమే కొరుకుతూ వెళ్ళింది, ఎడమ పక్కన ఉండే గడ్డిని అంటుకోలేదు," అన్నాడు.

"అదీ స్పష్టంగానే ఉన్నది. అయితే ఆ ఒంటెమీద ఒక ఆడదీ, ఒక బిడ్డా ఉన్న సంగతి ఎలా తెలిసింది?" అని పాదుషా అడిగాడు.

ఆ మాటకు మూడోవాడు, "ఒకచోట ఆ ఒంటె ముందు మోకాళ్ళమీద కూర్చున్నది. దాని పక్కనే ఇసుకలో ఆడదాని పాదాల గుర్తులూ, చిన్న బిడ్డ నడిచిన గుర్తులూ కనిపించాయి," అన్నాడు.

"అద్భుతం! అయితే పెట్టెలో ఉన్న దానిమ్మకాయను ఎలా కనిపెట్టారు. ఇక్కడ అగుడుజాడ లేవీలేవే!" అన్నాడు పాదుషా.

దానికి పెద్దవాడు, "ఆ పెట్టెలో బరువైన వస్తువేదీ లేదని, నౌకర్లు పెట్టె తెచ్చేటప్పుడే తెలిసింది. వాళ్ళు పెట్టెను కింద పెట్టేటప్పుడు అందులోని వస్తువు ఒక పక్కనుంచి మరోపక్కకు దొర్లినచప్పుడు వినిపించింది. దాన్నిబట్టి అది గుండ్రని వస్తువనీ, చిన్న వస్తువనీ తెలిసింది," అన్నాడు.

"ఆ పెట్టె దానిమ్మతోట వైపునుంచి రావటం గమనించి, పెట్టెలో ఉన్న చిన్న వస్తువు దానిమ్మకాయ అయి ఉంటుందని గ్రహించాను," అన్నాడు రెండోవాడు.

"అంతవరకు అర్థం చేసుకోవచ్చు, కాని అది పండని దానిమ్మకాయ అని ఎలా తెలుసుకున్నారు? అది మరీ విచిత్రంగా ఉన్నది," అన్నాడు పాదుషా.

అప్పుడు మూడోవాడు, "అందులో విచిత్రం ఏమీలేదే! దానిమ్మపళ్ళు కింకా తరుణంరాలేదు. మీరు తోటలోకి వెళ్ళి చూడండి. అన్ని చెట్లమీదా పచ్చి కాయలే కనిపిస్తాయి," అన్నాడు కిటికీలో నుంచి కనిపించే దానిమ్మతోటను చూపిస్తూ.

పాదుషా వాళ్ళ పరిశీలనా శక్తికి ముచ్చటపడి, "నిజంగా మీది సూక్ష్మబుద్ధి. మీవంటి బుద్ధిశాలులు ఉండి తీరవలసిందే," అని ఆ అన్నదమ్ములను తన కొలువులో ఉంచుకున్నాడు.



# దొంగ—దొరలు

రత్నగిరిరాజు ఏ నేరాన్నయినా క్షమించేవాడుగాని, దొంగతనాలు చేసినవారిని చాలా క్రూరంగా శిక్షించేవాడు. అందుచేత ఆ నగరంలో సాధారణంగా దొంగతనాలు జరిగేవి కావు.

కాని ఒకరోజు రాజభటులు ఒక దొంగను పట్టుకున్నారు. రాజు వాణ్ణి విచారించి, వాడికి ఉరిశిక్ష విధించాడు.

ఉరితీసే ముందు ఆ దొంగ రాజుగారితో, "మహారాజా, నాకు బంగారం చేసే విద్య తెలుసు. నేనెలాగూ చచ్చిపోతున్నాను గనక, అది నాతో అంతరించకుండా తమకు చెబుతాను," అన్నాడు.

"బంగారం చేసే విద్య తెలిసి దొంగతనానికి ఎందుకు పాల్పడ్డావు?" అని రాజు దొంగను అడిగాడు.

"అది నా దురదృష్టం. జీవితంలో ఎన్నడూ ఏ దొంగతనమూ చెయ్యనివాడికే ఆ విద్య పారుతుంది. అది నాకు తెలిసేటప్పటికే నేను దొంగను. అది మీలాటి గొప్పవారికి గాని పనిచెయ్యదు," అన్నాడు దొంగ.

రాజు ఆలోచించి, "చిన్నతనంలో నేనుకూడా తినుబండారాలు దొంగిలించాను," అన్నాడు. ఆయన మంత్రిని పిలిచి, దొంగ చెప్పే విద్యను నేర్చుకోమన్నాడు. కాని మంత్రి తానుకూడా చిన్నప్పుడు తండ్రి వద్ద చిల్లరడబ్బులు దొంగిలించానన్నాడు.

తరవాత రాజు తనకొలువులో ఉన్నవారినందరినీ అడిగాడు. కాని అందరూ ఎప్పుడో ఒకప్పుడు దొంగతనం చేసినట్టు చెప్పారు. దాంతో రాజుకు బుద్ధి వచ్చి, దొంగకు తేలిక శిక్ష విధించి, అది మొదలు దొంగలను క్రూరంగా శిక్షించటం మానుకున్నాడు.

—వి. వి. రమణమూర్తి






ధర్మరాజు ద్రౌపదిని కూడా పోగొట్టుకున్నాడు. ఇక అతనికి పోగొట్టుకోదగినది ఏమీ మిగలలేదు.

దుర్యోధనుడు, "ద్రౌపదిని పిలవండి. ఆమె చేత ఈ సభ ఊడ్పించాలి," అని కేక పెట్టాడు.

విదురుడు పట్టలేక దుర్యోధనుడితో, "మూర్ఖుడా, ఒళ్ళు తెలీక నోటికి వచ్చినట్టు మాట్లాడుతున్నావు. పాండవులకు కోపం తెప్పించటం విషసర్పాలను రెచ్చగొట్టటమే. ద్రౌపది నీకెలా దాసి అయింది? ధర్మరాజు తన స్వాతంత్ర్యం పోగొట్టుకున్నాక ద్రౌపదిని పందెం పెట్టాడు," అని సభ కేసి తిరిగి, "ఈ దుర్యోధనుడు మూఢుడు. నా మాట వినడు. కౌరవులకు త్వరలోనే నాశనం కలగబోతున్నది," అన్నాడు.

దుర్యోధనుడు ఈ మాట లేపి పట్టించుకోక ప్రాతికామి అనే వాణ్ణి పిలిచి, "నువు వెంటనే అంతఃపురానికి పోయి ద్రౌపదిని ఇక్కడికి తీసుకురా. ఈ పాండవులను చూసి నువు ఏ మాత్రం భయపడ నక్కర్లేదు," అన్నాడు.

దుర్యోధనుడి ఆజ్ఞ పొంది ప్రాతికామి పాండవుల బసలో ప్రవేశించి, "పాంచాలీ, నీ భర్త ధర్మరాజు జూదంలో నిన్ను పణంగా పెట్టి దుర్యోధనుడికి ఓడిపోయాడు. అందుచేత ఇప్పుడు నువు దుర్యోధనుడి దాసీవి. నిన్ను ధృతరాష్ట్రుడి ఇంటికి రమ్మని ఆయన ఆజ్ఞ," అన్నాడు.

25. ద్రౌపదీ వస్త్రాపహరణం



"క్షత్రియు డెవడైనా జూదంలో భార్యను పణంగా పెడతాడా? ధర్మరాజుకు మతి పోయిందా ఏమిటి? జరిగిన దేమిటో సరిగా చెప్పు," అన్నది ద్రౌపది.

"ధర్మరాజు తన కున్నదంతా జూదంలో పోగొట్టుకుని, పందెం కాయటానికి ఇంకేమీ లేకపోగా, తన తమ్ములను ఒడ్డి ఓడిపోయి, చివరకు తననూ, నిన్నూ కూడా పణం పెట్టి అంతా పోగొట్టుకున్నాడు," అని చెప్పాడు ప్రాతికామి.

"ఒరే నువు సభకు తిరిగిపోయి, అయన ముందు తనను ఓడి నన్నోడాడో, లేక ముందు నన్ను ఓడి తరవాత తనను ఓడాడో తెలుసుకురా!" అన్నది ద్రౌపది.

ప్రాతికామి జూదమాడిన చోటికి తిరిగి వచ్చి, ద్రౌపది సందేహాన్ని ధర్మరాజుతో చెప్పాడు. ఈ ప్రశ్న విని ధర్మరాజుకు పుట్టెడు దుఃఖం ముంచుకువచ్చి, ఏమీ చెప్పలేక పోయాడు.

దుర్యోధనుడు ప్రాతికామితో, "ఆమెను ముందు సభకు వచ్చి, తన సంశయాన్ని తానే తీర్చుకోమని చెప్పు. వెళ్ళు," అన్నాడు.

ప్రాతికామి మళ్ళీ ద్రౌపది వద్దకు పోయి, "అమ్మా, నిన్ను స్వయంగా వచ్చి నీ అను మానం తీర్చుకోమని సభవా రంటున్నారు," అని చెప్పాడు.

"ప్రాతికామీ, నేను ఆ సభకు రావటం చాలా తప్పు. అది కౌరవుల కీర్తికి పెద్ద కళంకం. నా ప్రశ్నకు సభలోని వారిని సమాధానం చెప్పమను. అటు తరవాత వారు ఏం చెయ్యమంటే అది చేస్తాను," అన్నది ద్రౌపది.

ప్రాతికామి ఆమె అన్న మాటలు సభకు తెలిపాడు. సభలోనివారు దుర్యోధనుడికి విరుద్ధంగా ఏమీ చెప్పలేక తలలు వంచి మౌనంగా ఉండిపోయారు. ఇది గ్రహించి ధర్మరాజు ద్రౌపదిని పిలుచుకు రావటానికి ప్రాతికామి వెంట ఒక దూతను పంపాడు. ఆ దూత ధర్మరాజు పిలిస్తున్నాడని చెప్పిన మీదట, ద్రౌపది బహిష్ఠ అయి ఉండి కూడా ప్రాతికామి వెంట సభకు వెళ్ళి, ధృతరాష్ట్ర

డికి ఎదురుగా దూరంగా నిలబడింది. పాండవులు ఎటు చూడటానికీ మొహాలు చెల్లక తలలు వంచుకుని దీనంగా, విషాదంగా కూర్చున్నారు.

వారి మనస్థితి గమనించి దుర్యోధనుడు మరింతగా విజృంభించి, ప్రాతికామితో, "చూస్తావేం. ఆమెను ఇక్కడికి తీసుకు రారా!" అన్నాడు.

ప్రాతికామికి ద్రౌపదిని అంటుకోవటానికి భయం వేసింది. అతను సభలో ఉన్నవారిని ఉద్దేశించి, "ద్రౌపదితో ఏమి చెప్పమన్నారు?" అని అడిగాడు.

వాడు భీముణ్ణి చూసి భయపడుతున్నాడని గ్రహించి దుర్యోధనుడు దుశ్శాసనుడితో, "దుశ్శాసనా. దాన్ని ఇలా ఈడ్చుకురా. మనకు దాసులైన ఈ శత్రువులు ఏమీ చేయలేరు," అన్నాడు.

దుశ్శాసనుడు మానాభిమానాలు వదిలేసి, "ద్రౌపదీ, ఇలా రా. నీ భర్తలు నిన్ను మాకు ఓడారు. సిగ్గెందుకు? మా దుర్యోధనుణ్ణి ప్రేమించు. కౌరవులను వరించు," అంటూ ద్రౌపదిని సమీపించాడు. ద్రౌపది వెలవెలపోతూ ముఖాన్ని చేతులతో కప్పుకుని, గాంధారి కేసి వెళ్ళసాగింది.

దుశ్శాసనుడు ఆమెను వెంబడించి, "ఇంకెక్కడికి పోతావు?" అంటూ ద్రౌపది జుట్టు పట్టుకుని లాగాడు. అయిదుగురు మహావీరులు భర్తలై కూడా అనాథ అయిపోయిన ద్రౌపది గడగడా వణికిపోతూ, హీనస్వరంతో, "ఓరీ, బుద్ధిహీనుడా!





నే నిప్పుడు ఋతువులో ఉన్నాను. నన్ను సభ మధ్యకు తీసుకు పోరాదు," అన్నది.

దానికి దుశ్శాసనుడు, "నువు బహిష్ఠవైతే నేం? బట్టలు లేనిదానివైతే నేం? నీ మొగుడు జూదంలో నిన్ను మాకు ఓడాడు. నువు మా దాసివి. ఇవాళ నుంచీ మా ఇతర దాసీలతో బాటు నువూనూ!" అంటూ ద్రౌపదిని జుట్టుపట్టుకుని సభా మధ్యానికి జరజరా ఈడ్చుకు వచ్చాడు.

ద్రౌపది జుట్టు ముడి ఊడిపోయింది, చీర సగం జారిపోయింది. సిగ్గూ, కోపమూ ఆమెను దహించాయి. ఆమె దుశ్శాసనుడితో, "దుర్మార్గుడా, తండ్రుల లాంటి ఈ అందరి ముందూ నే నిలా నిలవరాదు. నన్ను అవమానకరమైన స్థితిలో పెట్టకు. ఈ పాపిష్ఠి పనికి నువు అనుభవిస్తావు. ఈ సభలో అందరూ ధర్మం తెలిసినవారే కాని, ఒక్కరూ నిన్ను ఇదే మనరు. భరతకులం పుచ్చిపోయింది. ఈ అన్యాయాన్ని ఆపటం భీష్మ ద్రోణులకూ, విదుర ధృతరాష్ట్రులకూ కూడా సాధ్యం కాదులాగుంది!" అని పాండవుల కేసి చురచురా చూసింది.

దుశ్శాసనుడు, "ఓసి దాసీ!" అన్నాడు. ఆ హాస్యానికి కర్ణుడూ, శకునీ, దుర్యోధనుడూ విరగబడి నవ్వారు. మిగిలినవాళ్ళు లోలోపల దుఃఖపడ్డారు.

అప్పుడు భీష్ముడు ద్రౌపదితో, "అమ్మా, ధర్మసూక్ష్మం చెప్పటానికి లేదు. అయిదుగురికి భార్యవైన నిన్ను ధర్మరాజు పందెం పెట్టటం తప్పే. కాని ధర్మరాజు తన సర్వస్వమూ వదులుకుంటాడు గాని, ధర్మం వదలడు. ఆయన జూదంలో నిన్ను ఓడి నీకు మోసం చేస్తాడా?" అన్నాడు.

ఈ మాటకు ద్రౌపది, "ధర్మరాజు తన కిష్టంలేని జూదంలో దిగి, మోసానికి గురి అయి, అంతా పోగొట్టుకుని, ఇంకేమీ లేక, నన్ను పందెం పెట్టాడా? కొడుకులకూ, కోడళ్ళకూ నియమానుసారంగా భరణాలిచ్చే కౌరవ పెద్దలు నాకు తెలియజెప్పాలి," అంటూ ఏడ్చింది. దుశ్శాసనుడు అవాచ్యాలు పలికాడు.



ఆ మాటలు విని భీముడు ధర్మరాజుతో, "జూదగాళ్ళు నీతిలేని భార్యలను సైతం పణం పెట్టరు. పరమపవిత్రురాలైన ద్రౌపదిని నువు పణంగా పెట్టటం మహా అన్యాయం. సమస్త ఐశ్వర్యాలనూ, మమ్మల్ని ఓడితే ఓడావు. పాంచాలిని పణంగా పెట్టిన నీ చేతులు కాల్చాలి. సహదేవా, నిప్పు పట్టుకురా!" అన్నాడు.

అది విని అర్జునుడు భీముడితో, "ఇంత సేపు ఓర్చుకున్నవాడివి ఇప్పుడు అన్న మనస్సు నెందుకు బాధిస్తావు? ఈ జూదగాళ్ళ మూలాన నీ ధర్మబుద్ధి కూడా చెడి పోయిందా ఏం? పెద్దవాళ్లని దూషించ వచ్చునా? ధర్మరాజు తానై జూదం ఆడ లేదు; ఇతరులు పిలిస్తే రాజధర్మం పాటించి ఆడాడు. ధర్మరాజు చేసిన తప్పేమీ లేదు. శాంతించు," అన్నాడు.

ద్రౌపది అడిగినదానికి సభలో ఎవరూ జవాబు చెప్పకపోవటం చూసి, ధృతరాష్ట్రుడి కొడుకులలో ఒకడైన వికర్ణుడు, "ద్రౌపది అడిగినదానికి జవాబు చెప్పండి. కురు వృద్ధులూ, గురువులూ మాట్లాడరేం? పక్ష పాతం లేకుండా, రాగద్వేషాలు లేకుండా ధర్మం చెప్పండి," అని చాలాసార్లు గట్టిగా అన్నాడు.

ఎవరూ మాట్లాడలేదు. అతను ఇంకా ఇలా అన్నాడు:

"మీరు న్యాయం చెప్పకపోతే నేను చెబుతాను, వినండి. ఆడదీ, వేటా, జూదమూ, తాగుడూ—ఈ నాలుగింటికీ దాసుడైన రాజు ధర్మానికి నిలబడలేడు. ధర్మరాజు జూద మనే వ్యసనం మూలంగా తన సమస్తాన్నీ, తమ్ములనూ, తననూ ఓడి, చివరకు ద్రౌపదిని ఓడాడు. ద్రౌపది పాండవులంద రిదీ కాని, ధర్మరాజు సొంత సొత్తు కాదు. ఈమెను ఈ సభలోకి ఇలా తీసుకురావటం అన్యాయం. ఇది నా ధర్మనిర్ణయం," అన్నాడు.

వికర్ణుడికి కర్ణుడు అడ్డు వచ్చి, "ఈ సభలో పెద్దలెవరికీ తెలీని ధర్మం, కుర్ర వాడివి నీకు తెలిసిందా? ధర్మరాజు తన



సర్వస్వాన్నీ ఓడినప్పుడే ద్రౌపదినీ ఓడాడు. అందుకే పాండవులు మాట్లాడరు. ఈ ద్రౌపదిని ఈ సభకు తీసుకురావటం అన్యాయం అన్నావు. అయిదుగురు భర్తలు కలది కులట. అలాటి దాన్ని నిండుసభలో బట్టలు ఒలిచినా తప్పు కాదు. దుశ్శాసనా, వికర్ణుడు వదరటాని కేంలే? నువు ఆ పాండవుల బట్టలూ, ద్రౌపది బట్టలూ ఒలిచి పట్టుకురా," అన్నాడు.

కర్ణు డిలా అనగానే పాండవులు తమ పై బట్టలు తీసి దూరంగా పెట్టారు.

దుశ్శాసనుడు ద్రౌపది చీర విప్ప నారంభించాడు. అప్పుడు ద్రౌపది తనను రక్షించమని కృష్ణుణ్ణి ప్రార్థించింది. కృష్ణుడు అదృశ్యంగా వచ్చి అక్కడ నిలబడి, ద్రౌపదికి అనేక చీరలు ఇస్తూ పోయాడు. దుశ్శాసనుడు ఎన్ని చీరలు లాగేసినప్పటికీ, ద్రౌపది వంటిన చీర ఉంటూనే వచ్చింది. ఒక వంక దుశ్శాసనుడు ఒలిచిన చీరల గుట్ట చిన్న కొండ లాగా తయారయింది. దుశ్శాసనుడు విసిగిపోయి ఊరుకున్నాడు.[అట్టమీదిబొమ్మ]

భీముడు పట్టరాని కోపంతో, కింది పెదవి కొరికి, నేలను చేత్తో చరిచి, "అందరూ వినండి! ద్రౌపదికి మానభంగం కలిగించటానికి ప్రయత్నించిన ఈ దుశ్శాసనుణ్ణి యుద్ధంలో చంపి, వాడి రొమ్ము చీల్చి, వాడి రక్తం తాగుతాను! ఇదే నా ప్రతిజ్ఞ!" అన్నాడు.

ఇంత జరిగాక విదురుడు లేచి, చేతులు పైకెత్తి, "సభికులారా, ద్రౌపది ప్రశ్నకు సరి అయిన సమాధానం చెప్పకపోతే అధర్మం అవుతుంది. ఇంతమంది వున్నా వికర్ణు డొక్కడే తన అభిప్రాయం చెప్పాడు. దీనులకు ధర్మం చెప్పకపోతే అసత్య దోషంలో సగం మిమ్ముల నందరినీ అంటుకుంటుంది," అన్నాడు.

అప్పటికీ ఎవరూ మాట్లాడలేదు. దుర్యోధనుడు ద్రౌపదికి సైగ చేసి తన తొడ చూపాడు. భీము డిది చూసి మరింత మండిపడి, యుద్ధంలో దుర్యోధనుడి తొడలు గదతో విరగగొడతానని ఘోరప్రతిజ్ఞ చేశాడు.

అతను మండుతున్న అగ్నిజ్వాల లాగా కనిపించాడు.

దుర్యోధనుడు ద్రౌపదితో, "నా వల్ల ఏ తప్పూ లేదు. భీమార్జున నకుల సహదేవులు తమకు ధర్మరాజు ప్రభువు కాదని చెప్పితే నీకు దాస్యం ఉండదు," అన్నాడు.

అప్పుడు అర్జునుడు, "ధర్మరాజు మా కందరికీ ప్రభువన్నది నిజమే. కాని ఆయన తానే ఓడిపోయాక ఎవరికి ప్రభువో కౌరవులు చెప్పాలి," అన్నాడు.

ఆ సమయంలో అనేక ఉత్పాతాలు కలిగాయి. అది చూసి భయపడి ధృతరాష్ట్రుడు, "ఒరే దుర్యోధనా! దుర్మార్గుడా! ద్రౌపదిని సభ కెందుకు బలవంతంగా తెచ్చావురా? పాండవుల మీద నీ కీ పగ దేనికి? ఏమిటీ అన్యాయం?" అని కొడుకును మందలించి, ద్రౌపదిని దగ్గిరికి పిలిచి, "అమ్మా, నా కోడళ్ళలో నువే ఉత్తమురాలివి. నీ కేమి కావాలో కోరుకో, తల్లీ!" అన్నాడు.

ద్రౌపది పాండవులకు దాస్యవిముక్తి, వారి ఆయుధాలు వారికి తిరిగి ఇవ్వటమూ కోరింది.

"ఆహా, ఈ నాటికి పాండవులను ఒక ఆడది ఉద్ధరించింది!" అని కర్ణుడు వెటకారం చేశాడు.

భీముడు రౌద్రాకారం ధరించి, శత్రువుల నందరినీ ఆ క్షణమే నిర్మూలిస్తానన్నాడు. అతి కష్టం మీద అర్జునుడూ, ధర్మరాజూ అతనిని శాంతింపజేశారు. తర్వాత ధర్మరాజు ధృతరాష్ట్రుణ్ణి, "రాజా, మా కేమి ఆజ్ఞ?" అని అడిగాడు.

"నాయనా, నువూ, నీ తమ్ములూ ఇంద్రప్రస్థానికి వెళ్ళి హాయిగా రాజ్యం ఏలుకోండి. స్నేహపూర్వకంగా జూదం ఆడతామంటే సరే నన్నాను. ఆపకపోవటం నాది పొరపాటే. ముసలివాళ్ళమైన నన్నూ, గాంధారినీ చూసి నా కొడుకులు చేసిన దుష్కార్యాలను మరిచిపొండి. నీకూ, నీ తమ్ములకూ శుభం కలుగు గాక!" అన్నాడు ధృతరాష్ట్రుడు.

పాండవులు పెద్దలందరి వద్దా సెలవు తీసుకుని ద్రౌపదితో సహా ఇంద్రప్రస్థానికి తిరిగి వెళ్ళిపోయారు.





# శివపురాణం

## 2

దక్షుడు తన శిష్యులైన భృగువు మొదలైన ఋషులను వెంటబెట్టుకుని తన ఆశ్రమానికి వచ్చి వాజపేయ మనే యజ్ఞం చేశాడు. ఆయనకు శివుడి మీద చాలా కోపంగా వున్నది. అందుచేత ఈ వాజపేయంలో శివుడికి హవిర్భాగం లేకుండా చేశాడు.

అప్పటికీ దక్షుడికి శివుడి పైన కోపం చల్లారలేదు. అందుచేత ఆయన "బృహస్పతి యజ్ఞం" అనే మహాయజ్ఞం తలపెట్టి దానికి దేవతలనూ, మహర్షులనూ ఆహ్వానించి, వచ్చిన వారిని సత్కరించటానికి తన శిష్యులనూ, బంధువులనూ నియోగించాడు. ఇందులోకూడా ఆయన శివుడికి భాగం ఇవ్వ దలచలేదు.

ఈ యజ్ఞానికి విశ్వదేవతలూ, మరుత్తులూ, పితృగణాలూ, అప్సరసలూ, గంధర్వ, సిద్ధ, విద్యాధర, కిన్నర, యక్షులూ, కస్యప, అగస్త్య, అత్రి, భృగు, మరీచి, నారద, పరాశరాది మహర్షులూ వచ్చారు. బ్రహ్మ విష్ణులు తప్ప మిగిలినవారంతా దక్షుడికి భయపడే వచ్చారు. వచ్చినవారి కందరికీ విడుదులు ఏర్పాటు చెయ్యటానికి విశ్వకర్మ నియోగించబడ్డాడు.

దక్షుడు యజ్ఞదీక్ష వహించి, భార్యా సమేతుడై యాగశాల ప్రవేశించి, సభా వందనం చేశాడు. పిలవని కారణంగా శివుడు ఆ సభలో లేడు. బ్రహ్మ విష్ణువులు పిలిచినా రాలేదు. అనేకమంది దేవతలతోనూ, మహర్షులతోనూ నిండి ఉన్న ఆ సభలో శివభక్తులైన మరీచీ, దధీచీ, భృగుడూ మొదలైన మహర్షులు సభను కలయజూసి, "ఓ దక్షా, ఈ సభకు సతీదేవినీ, శివుణ్ణీ పిలవ లేదా? వాళ్ళు ఇక్కడ ఎందుకు లేరు?" అని అడిగారు.



దానికి దక్షుడు, "శివుడు కర్మభ్రష్టుడు. అందుచేత అతన్ని పిలవలేదు. అతను అపవిత్రుడు, కపాలధారి, శ్మశానవాసి, ప్రేతగణాలకు ప్రభువు," అన్నాడు.

ఈ శివదూషణ విని దధీచి, "దక్షా, ఈ యాగం నెరవేరదు. శివుడు లేకుండా ఈ యాగం తలపెట్టి నువు ఆపదనూ, విచారాన్నీ కొనితెచ్చుకుంటున్నావు. ఈ యాగానికి వచ్చినవారు కూడా దుఃఖిస్తారు," అనివామదేవుడూ, మరీచీ, గౌతముడూ, శిలాదుడూ మొదలైన అనేకమంది రుషులతో సహా సభ నుండి వెళ్ళిపోయాడు.

దక్షుడు అలా వెళ్ళిపోయినవారిని గురించి సభలో నిలిచి ఉన్న వారితో, "వాళ్ళు పాషండులు, శఠులు. వాళ్ళు వెళ్ళిపోవడమే మంచిది. అందుచేత మీ రేమీ విచారించక, నా యజ్ఞాన్ని పూర్తిచెయ్యండి," అన్నాడు.

ఈ లోపల కైలాసపర్వతం మీద శివుడితో సుఖంగా కాపరం చేస్తున్న సతి ఒకనాడు తన చెలికత్తెలతో ఉద్యానంలో విహరిస్తూ, ఆకాశాన అనేక విమానాలు పోతూండటం చూసింది. ఆ విమానాలు ఎక్కడికి పోతున్నాయో కనుక్కోమని సతీదేవి తన చెలికత్తెలను అడిగితే వాళ్ళు వెళ్ళి వచ్చి, దక్షుడు చేస్తున్న యజ్ఞానికి వాళ్ళంతా వెళుతున్నట్టు చెప్పారు.

సతీదేవికి తాను కూడా తన భర్తతో సహా తన తండ్రి చేసే యజ్ఞానికి పోవాలని కోరిక కలిగింది. ఆమె శివుడి వద్దకు వెళ్ళి, "మా నాన్న యజ్ఞం చేస్తున్నాడట. దేవగణాల వాళ్ళంతా వెళుతున్నారు. మనం కూడా రుద్రగణాలను తీసుకుని అక్కడికి వెళదాం," అన్నది.

దానికి శివుడు, "సతీ, మన మీద నీ తండ్రికి ద్వేషం. అందుచేత మనని పిలవకుండానే యజ్ఞం చేస్తున్నాడు. పిలవని పేరంటానికి పోరాదు. పోతే మనకు అవమానం జరుగుతుంది. తరవాత ఆపదలు కలుగుతాయి," అన్నాడు.

"అలా అయితే, మీరు రావద్దు. నేను ఒక్కత్తెనే పోతాను. నా వాళ్ళు నన్నెందుకు

అవమానిస్తారు? నా తండ్రికి తోచకపోతే నేనైనా చెప్పి, మిమ్మల్ని పిలిచేటట్టు చేస్తాను. నందీశ్వరుడు మొదలైనవాళ్ళను సహాయం ఇచ్చి నన్ను పంపండి," అన్నది సతీదేవి.

"సతీ, నిన్ను విడిచి నేను క్షణం ఉండ లేను. నువు నన్ను విడిచి మీ తండ్రి చేసే యజ్ఞానికి వెళ్ళిపోతున్నావు. నీకు తప్పక అవమానం జరుగుతుంది, ప్రమాదం కలుగు తుంది. రాబోయేది కాస్త ఆలోచించు," అని శివుడు సతీదేవితో అన్నాడు.

కాని సతీదేవి శివుడి మాటలలో ఉన్న నిజం తెలుసుకోలేక పోయింది; తన తల్లి దండ్రులు తనను అవమానిస్తారని ఊహించ లేక ఆమె పుట్టింటికి వెళ్ళాలని పట్టుపట్టింది.

ఎలా జరగవలసి ఉంటే అలా జరుగు తుందనుకుని శివుడు రుద్రగణాలను తోడిచ్చి సతీదేవిని దక్షయజ్ఞం చూడటానికి పంపిం చాడు. ఆమె నందీశ్వరుణ్ణి కూడా వెంట బెట్టుకుని యజ్ఞశాల వద్దకు చేరేసరికి, ఆమె తల్లి ప్రసూతీ, సహోదరులూ ఎదురు వచ్చి కుశల ప్రశ్నలు చేశారు. సతీదేవితో ఆమె తల్లి రహస్యంగా, "మీ నాన్నకు ముసలి తనం వచ్చేసింది. ఆయన నీ భర్తను తిడు తున్నాడు. నువ్వేమీ పట్టించుకోకు," అని చెప్పి, ఆమెను యజ్ఞశాలలోకి తీసుకు పోయింది.



దక్షుడికి తన కుమార్తెను చూడగానే శివుడి మీద ఆగ్రహం పెరిగింది. ఆయన సతితో, "నీ మొగుడు శ్మశానవాసి, పిశాచా లను ఏలుతాడు, కపాలాలు ధరిస్తాడు, అపవిత్రుడు, యజ్ఞయాగాదులకు పిలవరాని వాడు. అతని భార్యవై నువూ అపవిత్రురాల వయావు. నీ మొగుణ్ణి నేను పిలవలేదు, అతనికి యాగభాగం ఇవ్వటం లేదు. నువు ఈ యజ్ఞాన్ని అపవిత్రం చెయ్యటానికి వచ్చావా?" అన్నాడు.

సతీదేవి ఈ మాటలు విని తండ్రితో, "యజ్ఞకర్త అయిన శివుడికి హవిర్భాగం లేకుండా యజ్ఞం చేస్తున్నావు; పైగా ఆయ నను దూషిస్తున్నావు. ఇప్పటికైనా ఆయనను

పిలిపించి, యజ్ఞభాగం ఇచ్చి గౌరవించు! లేకపోతే నీ యజ్ఞం పూర్తి కాదు; నువు నశిస్తావు!" అన్నది.

సభలో ఉన్న భృగువు మొదలైనవారు, ఆమె చెప్పినట్టు చేయమనీ, ఆమె అన్నది నిజమనీ దక్షుడికి హితం చెప్పారు.

దక్షుడు మరింత మండిపడి, "సతీ, నీ మొహం చూస్తే పాపం! నువు యజ్ఞశాల నుంచి తక్షణం వెళ్ళిపో. పోకపోతే నిన్ను బలవంతాన గెంటిస్తాను," అని అరిచాడు.

సతీదేవికి హృదయం మండిపోయింది. భర్త మాట వినకుండా రావటం పొరపాటయిందని ఆమె గ్రహించింది. ఈ అవమానం పొంది భర్త దగ్గిరికి తిరిగి పోవటం ఇష్టం లేక, వచ్చే జన్మలో శివుడే భర్త కావాలని కోరుకుంటూ, యోగశక్తితో అగ్ని పుట్టించుకుని అందులో ప్రాణాలు వదిలింది.

ఇది చూసి నందీశ్వరుడు మొదలైన వాళ్ళు హాహాకారాలు చేస్తూ యజ్ఞశాల ప్రవేశించబోతే, భృగుమహర్షి అభిచార హోమం చేసి వారిని తరమగొట్టాడు.

నారదుడు మొదలైనవారు కొందరు కైలాసానికి వెళ్ళి శివుడితో జరిగిన సంగతి చెప్పారు. శివుడు క్రోధాగ్రహావేశుడై హుంకరిస్తూ తన జటను ఒకదాన్ని పెరికి పర్వతం మీద కొట్టాడు. అప్పుడా జట నుండి భద్రకాళీ, వీరభద్రుడూ పుట్టారు. వీరభద్రుడు వెయ్యి చేతులతో, నిడుపాటి కోరలతో, కోటి సూర్యుల కాంతితో మహారౌద్రాకారుడై ఉన్నాడు. అతను శివుడికి నమస్కరించి, "తండ్రీ, ఏమిటి నీ ఆజ్ఞ?" అన్నాడు.

"నాయనా, వీరభద్రా! నువూ, భద్రకాళీ మీ గణాలతో సహా వెళ్ళి, దక్షయజ్ఞం ధ్వంసం చేసి, అందులో పాల్గొన్నవాళ్ళను దండించండి!" అన్నాడు శివుడు.

వీరభద్రుడు సింహాలను పూన్చిన రథం ఎక్కి, నందీశ్వర, చండీశ్వర, భైరవాది గణాలను వెంటబెట్టుకుని బయలుదేరాడు. భద్రకాళి సింహాన్ని ఎక్కి, మహాకాళీ, గౌరీ, కాత్యాయినీ, చాముండా మొదలైన మహాశక్తి గణాలను వెంటబెట్టుకుని బయలుదేరింది.



# 112. పదివేల పొగలలోయ

అలాస్కా (ఉత్తర అమెరికా) లోని కట్మాయ్‌పర్వతాలలో ఒక అగ్నిపర్వతం 1912 జూనులో పేలింది. చరిత్రయుగంలో జరిగిన బ్రహ్మాండమైన పేలుళ్ళలో చేర్చదగినది ఈ పేలుడు. దీని ఫలితంగా 7 ఘనపు మైళ్ళ పరిమాణం గల బొగ్గుధూళీ, గాజుధూళి భూగర్భం నుంచి ఆకాశంలోకి లేచి, 1500 మైళ్ళ దూరాన కూడా పడ్డాయి. ఈ ధూళి మూలాన ప్రపంచ వాతావరణ మంతా ప్రభావితమయింది.

1915 లోనూ, 1916 లోనూ ఈ పేలుడు సంభవించిన ప్రాంతానికి పరిశోధకులు వెళ్ళి అనేక వింతలు చూశారు. ఆ ప్రాంత మంతా నిర్జీవంగా ఉన్నది. ఎక్కడ చూసినా దట్టంగా గాజు ధూళి (ప్యూమిస్) పడి ఉన్నది. కట్మాయ్ సముద్రతీరాన గడ్డిపరక కూడా లేదు. ఎక్కడ చూసినా మడుగులు. కొండల మీది నుంచి అడపాదడపా బండరాళ్ళు దొర్లి పడుతున్నాయి. అగ్నిపర్వత ప్రాంతంలోని నదీలోయలో ఉండిన ఇళ్ళు ధూళిలో మునిగిపోయి ఉన్నాయి. అనేకచోట్ల గుల్లగాజు శిలలు కనిపించాయి; అవి నీటిలో తేలుతాయి.

పేలుడుకు ఆ ప్రాంతంలో అనేక అరణ్యాలు మాడిపోయి, చెట్లు శవాల లాగా నిలబడి ఉన్నాయి. కాని అక్కడి దృశ్యాలన్నిటిలోకీ అద్భుతమైనదీ, ఊహాతీతమైనదీ 'పదివేల పొగలలోయ." లోయ అంతటా అసంఖ్యాకమైన చిన్న చిన్న అగ్నిపర్వతాలుండి, వాటి నుంచి ఆవిరి పైకి లేస్తున్నది. ఒక వెయ్యి బిలాల నుంచి 500 అడుగుల ఎత్తు కూడా లేస్తున్నది!



Photo by Chandrakant Khata



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఏటి ఒడ్డున మీరు

పంపినవారు:
ఎస్. రాజేశ్వరి, నెల్లూరు

Photo by D. N. Shirke



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఏమి చేస్తున్నారు?

పంపినవారు:
ఎస్. రాజేశ్వరి, నెల్లూరు

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1971 మే నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మార్చి నెల ఆఖరు తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/- లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఏటి ఒడ్డున మీరు

రెండవ ఫోటో : ఏమి చేస్తున్నారు ?

పంపినవారు : శింగరాజు రాజేశ్వరి,

24-13, రాంనగర్, నెల్లూరు-2

బహుమతి మొత్తం రు. 20/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'






AMRUTANJAN
Pain Balm
Amrutanjan Ltd.



ఇప్పుడు అమ్మబడుతున్నది

# అంబిళి అమ్మావన్

మీకు ప్రియమైన కుటుంబ పత్రిక
మలయాళములో చందమామ



బొమ్మలు, కథలు, జానపద కథలు... భారతదేశానికీ,
ప్రపంచ దేశాలకూ సంబంధించిన పురాణ కథలు

వివరాలకు:

## డాల్టన్ ఏజన్సీస్

'చందమామ బిల్డింగ్స్'

మదరాసు - 26




నమలండి

# చిక్లెట్స్ చూయింగ్ గమ్,

తెలుసుకోండి వాటి మజా

ఊరూర తిరుగుతూ తెచ్చాడు చిక్లెట్స్ బఫూన్
మీ లాంటి పిల్లలకు చిక్లెట్స్ చూయింగ్ గమ్
మీరు ఎరుగని నాల్గు క్రొత్త చూయింగ్ గమ్ రుచులలో
ఆరంజ్, లెమన్, పెప్పరమింట్, టూటి-ఫ్రూటి.

తాళికట్టినవాడు తనవాడు కానప్పుడు,
తపించే హృదయంలోని రాగబంధమే పవిత్రబంధం!

అశోక్ మూవీస్

# పవిత్రబంధం

దర్శకుడు: వి.మధుసూదనరావు  నిర్మాత: టి.గోవిందరాజన్
కథ: ఆరుద్ర  సంగీతం: రాజేశ్వరరావు  ఫోటోగ్రఫీ: కె.ఎస్. రామకృష్ణరావు

NVKR






నవయుగ

సోల్ డిస్ట్రిబ్యూటర్స్: అనిల్ ప్రభాస్ ఎంటర్‌ప్రైజెస్

